# అమ్మ సూచించే కొత్తదారి



గ్రంథకర్త :
డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి



మాతృశ్రీ పబ్లికేషన్సు ట్రస్టు
బాపట్ల

# అమ్మ సూచించే కొత్తదారి



గ్రంథకర్త

డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి



ప్రచురణ

మాతృశ్రీ పబ్లికేషన్సు ట్రస్టు

బాపట్ల.

# ఉపక్రమణిక

'ప్రతిరోజూ ఎంతమందో అమ్మని దర్శించడానికి వస్తూంటారు అని చెపుతున్నారుకదా, అమ్మ వారికేదైనా సులువైన సాధనగాని సూటియైన మార్గముగాని సూచిస్తారా?

సులువైన మార్గము ఇదీ అంటూ లేదంటారు. అడగడము మాత్రము 'సులభమైన మార్గము' చెప్పమని అడుగుతూనే ఉంటారు కొందరు. "నీవు నిత్యమూ చేయ గలిగిందేదో అదే నీ సాధన" అని చెపుతారు అమ్మ.

'అలాగ చెపితే ఆ వచ్చినవారికి ఏమి లాభమూ?'

"సాధన అన్నది చేసేవాడికి తెలియకుండానే జరుగు తుంది" అన్నారు అమ్మ. ఆధ్యాత్మిక రంగంలో ఎవడేనా తనకి తృప్తి శాంతీ ఇచ్చేనని చేస్తాడూ, అది కొన్నాళ్ళు చేసిన తరువాత వెనక్కి చూసుకుని దానిని గుర్తించి అంత

కంటె గొప్పదో, సులభమైనదో, సూటి అయినదో ఇంకోదారి ఉందీ అని అనుకుంటాడు. ఎవరైనా మహాత్ములదగ్గరకు వచ్చినప్పుడు 'సులువైన దారి ఏదైనా చెప్ప' మంటాడు. ఆ మహాత్ముడు ఏదైనా సాధన చేసి ఉండిన వాడైతే తాను చేసిఉండిన సాధనని చెయ్యమని చెప్తాడు. మహాపండితుడైతే శాస్త్రిలు చెప్పే కర్మ భక్తి యోగ జ్ఞాన మార్గాలను ఉపన్యసిస్తాడు. ఉపాధ్యాయుడైతే పురాణాలూ ఇతిహాసాలూలోని కథలు తనకు తెలిసినవి ఏకరవు పెడతాడు. విన్నవాడు బేజారై 'ఇన్నిట్లోనూ ఏ దారి పట్టాలి భగవంతుడా' అని యదాగుండె పడతాడు."

'అమ్మ ఏం చెపూతారూ?'

మామూలు ప్రసంగము చేస్తూనే, "ఇప్పుడేం చేస్తున్నారూ" అని అడిగి, పృచ్ఛకులు రోజూ చేస్తూన్న 'సాధన' తబిశీళ్ళు తెలుసుకూంటారు. తరవాత ఆ సాధన సుగుణాలు వివరిస్తూ అది మంచిదే అన్న అభిప్రాయము కలిగిస్తారు. దానితో వారు 'అయితే ఇది మంచిదే, చెయ్యమంటారా అమ్మా?' అని అడుగుతారు. అమ్మ ఆమోదిస్తారు. వారు ఏనుగంత బలముతో తిరిగి వెళ్ళుతారు.

'అంటే ఏ పద్ధతైనా మంచిదే అంటారనా?'

నీ పద్ధతి నీకు మంచిదే అంటారు. ప్రతీవాడికీ అన్ని పద్ధతులూ మంచివి అని కాదు. మొత్తముమీద ఏ పద్ధతైనా మంచిదే. ఎవడికి వాడికి వాడి పద్ధతే మంచిది.

‘అయితే ఈ గురువులంతా దండుగే నన్నమాటా?,

వాల్మీకి ధ్రువుడూవంటి సాధకుల కథలూ, నారదుడూ రామకృష్ణపరమహంసవంటి గురువుల సూచనలూ విన్న వారము గురువులు దండుగ అని ఎలాగంటామూ? పోస్టాఫీసు ముద్రల్లాగ తమదగ్గరకు వచ్చినవారందరికీ మంత్రోపదేశాలో, లేకపోతే ఉపాసనలో కాకుంటే ధ్యానయోగమో మాత్రమే వరసగా ముద్రవేసి పంపే గురువులు, తమకు చేతనైన దానిని చెపుతారు. వచ్చిన వారికి చేతనయ్యేది చెప్పరు; కనుక, ఆ వచ్చిన వారికి అందరికీ ఒకే ముద్ర వేసే అలాటి గురువులు దండుగే మరి!

‘అయితే ఈ మాట చెప్పండి; అమ్మ గొప్ప అనుభవజ్ఞురాలు కదా, మరి అలాటి అనుభవజ్ఞులు ఇంతవరకూ మనకు తెలియని కొత్తదారులు ఎరిగివుంటారు కదా, అలాటి కొత్తదారి ఏదైనా అమ్మ చెప్పివున్నది గానీ వారి మాటల్ని బట్టి మీకు తట్టినదిగానీ వున్నదా?

ఇన్నాళ్ళూ లేదుగాని ఈ నడుమ నిర్వికల్పసమాధీ సహజ సమాధీ అనేవి ఏమిటి? – అని పుస్తకాలు చదువుతూ జిజ్ఞాస చేస్తూంటే తట్టింది నాకు అమ్మ సూచించే కొత్తదారి ఒకటి.

హృషీకేశము నేను వెళ్ళినప్పుడు శివానందాశ్రమములో ఉన్న కృష్ణానందస్వామికి నన్ను అదివరకు ఏమీ ఎరగని వారికి – ఆ దారిని గురించి ఎంతో టూకీగా చెప్పి అడిగేను.

"అడ్డేమిటీ, తప్పకుండానూ" అన్నారు ఆయన. ఇంటికి వచ్చిన తర్వాత అలాటి సాధకుడికి ఉదాహరణకోసము ఆలోచిస్తూంటే ఇదివరకు కొంతకాలంనుంచి తెలిసినాయనే ఒకాయన స్ఫురించారు. నాకు కళ్ళకి కట్టిన గుడ్డ విప్పినట్లైంది. నేను వట్టి థియరీయే పలుకుతూండవచ్చునుగాని ఆయన అనుక్షణమూ - అదొక దారి అని అనకుండా - అనుష్ఠిస్తున్నారు. ఆయన రాతలు - ఆ రాతల ద్వారానే నా కాయన పరిచయము - చదువుతూంటే 'గమ్యానికి ఈయన ఒక్కడుగు దూరంలో ఉన్నారు' అనిపిస్తోంది.

'అది అమ్మచెప్పిన దారేనా?'

అమ్మ పరిచయమైన తర్వాతనే ఆయన ఈ ధోరణి అవలంభించారూ సాగిపోతున్నారు. 'దీన్ని నాకు నేను నమ్మి ఉండిన మహాత్ములెవరూ చెప్పలేదంటున్నారూ అమ్మ మాటల నుంచి తెలుసుకుంటున్నారూ, 'అమ్మ శిశువు' నంటున్నారు.

'ఇంకేం? చెప్పండి. నేను అడిగిందీ అదే, మీరు చెప్పబోయేదీ అదే.'

అలాగే చెపుతా. అయితే మొదటలోనే నేను ఒక మనవి చేస్తున్నాను. దయచేసి జాగ్రత్తగా విని, నేను చెప్పబోయే విషయాలన్నిటవట్లా ఇది వర్తిస్తుంది అని గమనించండి. నేను చెప్పబోయేవి నా అభిప్రాయాలు మాత్రమే. సాక్ష్యమును మాత్రము గ్రంథాలనుంచీ, మహాపురుషుల

చరిత్రనుంచీ వారు అన్నారని రికార్డయిన వాక్యాలనుంచీ, ఉపనిషత్తులనుంచీ యథాతథంగా సేకరించుకున్నాను. ఆ సాక్ష్యము ఉంటే చెప్పండి శిరసావహిస్తాను. నేను ఉటం కించిన వాక్యాల అర్థము వాటినిబట్టే గ్రహించానుగానీ, భాష్య కారులు చెప్పే తాత్పర్యార్థ విశేషార్థాల సాయముతో కానే కాదు. కనుక, నేను స్వీకరించిన దండాన్వయము తప్పు అని మీ కనిపిస్తే చెప్పండి. "దాని అసలు ఉద్దేశము ఇదీ" అని అక్కడ ఉన్న అర్థాన్ని దాటించి అడ్డురావద్దు. ఇది ఒకటీ. ఇక రెండో విషయము: 'నీకు వారి అనుభవా లన్నీ ఉన్నాయా?' అన్న ప్రశ్న వేయవద్దు. నాకు నా అనుభవము కాదు ఆధారము, అనుభవజ్ఞుల మాటలు మాత్రమే. నేను చేసినది కేవలము ఆ మాటలకూర్పూ, అది రేపే ఆలోచనా మాత్రమే; వారి పలుకుల అధ్యయ నమూ, తత్ఫలితమైన ఆలోచనాను. 'నాకు అట్లనిపించ లేదు' అని నేను అన్నప్పుడల్లా 'వీడికి ఎందుకనిపించదూ? ఏమిటి వీడి ఉద్దేశమూ?' అని పరిశీలించండిగాని, 'ఆయన కన్నా నీ కెక్కువ తెలుసా?' అన్న మొద్దంకె ప్రశ్నవేసి లాభము లేదు.

'అంతే లెండి. అవే ప్రమాణము, మరొకటి కాదు అను కునే మాటయితే మరొకటి చదవనక్కరయే లేదు. ఆ లెక్కని వేదాంత ప్రస్థానాలలో ఇన్ని భేదాలుండే అవకాశమే లేదు.'

సంతోషం. మరి వినండి.

# విషయసూచిక

# సహజ సమాధి

చిరకాలమునుంచీ భారతదేశ ఆధ్యాత్మికతలో సమాధి స్థితి గొప్పగా గణించబడుతూన్నది. సవికల్ప సమాధీ నిర్వి కల్ప సమాధీ అన్నవి మీరు వినే ఉంటారు.

'ఆఁ. దృక్కూ దృష్టీ దృశ్యమూ అనే మూడూ అల్లు కుని ఉండే ధ్యానము సవికల్పమన్నారు.'

అమ్మ దీనినే కాబోలు శబ్దమూ అర్థమూ నువ్వూ వున్న స్థితి అన్నారు. చెప్పండి, వికల్పమంటే ఏమిటి?

'ధ్యానములో ఒకటే వుండడానికి బదులు రెండుగానీ, మూడుగానీ వున్నప్పుడు ముఖ్యమైన దానికి తక్కినవి వికల్పాలు అని అర్థము చెప్పేరు. నిర్‌వికల్పమంటే వికల్పము లేని స్థితి. అంటే, లక్ష్యము ఒక్కటి మట్టుకే గమనికగా వుంటే

అది నిర్వికల్పమన్నమాట. అది సరేగానీ, మీరుకదా ఏదో చెపుతున్నారూ? ఆ సమాధులు ఏమేమిటో, వాటిలో ఉన్నప్పుడు సాధకుని స్థితి ఏమిటో మీరు చెపుతూ మీ విశ్వాసము ఏదో చెప్పాలి కదా? నన్నడిగేరేమీ?

మనము మాట్లాడే పరిధి పరిమితము చేసుకోడానికి.

పరిధి మీకూ నాకూ మట్టుకే పరిమితము కాదు. ఈ లక్ష్మీనారాయణ కాకుంటే ఇంకొకరడుగుతారు. వారికి కూడా చెప్పినట్లుగా ఇప్పుడు చెప్పాలి కదా మీరూ? అమ్మ ఏమంటారూ వీటిని గురించీ?

అమ్మ తానై ఏ ఉపదేశాలూ ఏ శాస్త్రవివరణ చెయ్యరు. ఎవరైనా అడిగితే వారికి కావాలసిన రెండు మాటలూ చెపుతారు కాని ఆ శాస్త్రములో చెప్పినది సత్యమూ ఇది కాదూ అని వివరించరు. వారప్పుడప్పుడు చెప్పిన రెండు మూడు మాటల్ని తిరగా మరగా వేసుకుంటే నా కర్థమైనది చెపుతా వినండి. కల్పము అంటే కల్పించుకున్నది. ఏదో రూపాన్ని కల్పించుకుని ఆ రూపము మీదనే గమనిక నిల్పడము సవికల్ప సమాధి. ఆ రూపము శ్రీరాముడో, కుమారస్వామో, దుర్గాదేవో, క్రీస్తో, జ్యోతో, నాదమో ఎవరేనా కావచ్చు. ఈ వస్తుగమనిక చిరాభ్యాసమువల్ల కేవలము స్ఫురణగా నిలిస్తే- అది నిర్వికల్ప సమాధి. ఇది కేవల నిర్వికల్పము అన్నారు రమణమహర్షి. 'ఏ (వి)కల్పమూ లేని స్థితి' అని అర్థము వస్తూనా్న ఈ స్థితిలో అంతా తానుగానే- రాముడో శివుడో

జ్యోతో నాదమో గానే వుంటాడు. ఏమీ లేకుండా వుండే స్థితి కాదు ఇది. ఈ స్థితులు రెండున్నూ కొంత కాలము వుండి జారిపోతాయి. సాధకుడు తన మామూలు జాగ్రత్ స్థితికి వస్తాడు.

'పతంజలి యోగసూత్రాలలో సవితర్క-, నిర్వితర్క-, సవిచార-, నిర్విచార-, సమాధులూ, ఇంకా వేదాంతులు కేవల నిర్వికల్ప, దృశ్యానువిద్ధ-, శబ్దానువిద్ధ-, సమాధులూ అంటూ చాలా చెప్తారే అవి ఏమిటంటారూ?'

పతంజలి చెప్పిన అసంప్రజ్ఞాత సమాధి అన్నది వేదాంతుల కేవల నిర్వికల్పము - దానినే నిర్వికల్పము అన్నారు - అనీ, తక్కినవి వేరు సమాధులు కావు ధ్యానములో వున్న వికల్పాల భేదాలనుబట్టి యోగులు పేర్లుపెట్టుకున్న సవికల్ప సమాధే ననీ, అనుకుంటున్నాను నేను. రమణమహర్షి 'సహజ నిర్వికల్పము' అన్నది ఈ సవికల్ప నిర్వికల్ప సమాధులకంటె పై స్థితి. సహజ సమాధి అనీ సహజస్థితి అనీ కూడా అంటారు దానిని. ఈ స్థితిలో ఉన్న వారికి సర్వమూ బ్రహ్మమే, కానిది ఏమీ లేదు. సుగంధమూ దుర్గంధమూ, అన్నమూ అశుద్ధమూ, మంచీ చెడ్డా, సుఖమూ దుఃఖమూ, రూపాలన్నీ గుణాలన్నీ క్రియలన్నీ అనుభవాలన్నీ ఒక దానివే. కనుక ఎక్కువ తక్కువలు వారికి లేవు. వారి ఈ స్థితి సహజము. నిర్వికల్ప సమాధికిలాగ వారు సహజస్థితికి ఏ యత్నమూ ఎప్పటి కప్పుడు చేస్తూండ నక్కర లేదు.

'వారి చేతలెట్లాగుంటాయో కొంచెము చెప్పండి.'

వేడినీళ్ళస్నానము వారికలవాటనుకొండి. ఒకనాడు కర్రిలు తడిసి వుంటాయి వేడినీరు లేదు. చన్నీళ్ళే పెట్ట మంటారు వారు. వారికి ఒకరు శివలింగము తెచ్చియిస్తారను కొండి. . వారు ఆ లింగాన్ని స్థాపనచేస్తే చేస్తారూ, లేకపోతే కొట్టవలసివస్తే కుంకుడు కాయలు కొట్టడానికేనా ఉపయో గిస్తారు. తుడవవలసివస్తే వారికి వీధివాకిలీ, ఇంకొకరి కన్నీరూ, జ్వరరోగి చొంగా కుష్టురోగి కాలూ ఒకటే. ఏదీ తక్కువా కాదూ ఎక్కువా కాదూ. పట్టువంచె ఇచ్చి కట్టుకో మని ప్రార్థేయ పడితే చుట్టబెట్టుకుంటారూ, గోచీపెట్టుకు కూచోవలసివస్తే కూర్చుంటారు.

'వారికి రాగద్వేషాలూ సుఖదుఃఖాలూ ఉండ వంటారు?'

సుఖమూ దుఃఖమూ మనకి లాగే వారికీ వస్తాయి. పరీక్ష ప్యాసయ్యానని ఎవరోచెప్పి సంతోషంతో గంతులువేస్తే వారితోపాటు సంతోషించినట్టూ వుంటారూ, కష్టము చెప్పు కుని ఎవరేనా దుఃఖిస్తున్నట్టూ ఉంటే – వారితోపాటు కన్నీళ్లు పెట్టుకునీ కనబడ తారు. కాని అందరూ ప్యాస వుతూనే వుండాలనీ, ఎవరికీ కష్టము రాకూడదనీ వారు కోరరు. వారితో సంతోషమూ వీరితో కన్నీరూ ఎప్పుడేది వస్తే దాన్ని హాయిగా - వద్దనకుండా - అనుభవిం చేస్తారు.

'వారు ఏం కోరతారూ!'

ఏదీ కావాలనిగానీ, ఏదీ వద్దనిగానీ వారికుండదు. ఏ సమయానికి ఏది వస్తే అది అనుభవిస్తారు.

'మనం మాత్రం ఏం చేస్తాం?'

మనం అలో లక్ష్మణా అంటూ అనుభవిస్తాము శత్రువులకు కూడా ఇది వద్దు బాబూ అని బాధపడతాం. ఇంకొకప్పుడు ఇంతకంటే సుఖం ఏముందీ, ఇలాగ వెళ్ళిపోతే బాగుండు ననుకుంటాం. సహజస్థితిలోనివారు అదివద్దూ అనరూ, ఇదే కావాలి అనరూ.

'తామరాకుమీది నీరు లాగా?'

అవును. తామరాకు నీటిలో పుట్టింది, నీటిలో పెరిగింది, నీటిలోనే వుంటుంది గాని నీరు దాని మీద నిలవదు.

'సరే చెప్పండి మీరు చెప్పబోయేది.'

నిర్వికల్ప సమాధిస్థితిని గురించి ప్రారంభిస్తాను. నిర్వికల్ప సమాధిలో మనస్సు (బాగా అణిగి అయితే వుంటుందిగాని వుండడము) వుంటుంది. లేకనేపోతే – గోవింద – గోవింద అని తోతాపురి భజన చేయించినప్పుడు రామకృష్ణపరమహంస ఉత్థానుడైనట్లు – (ఆ) సమాధిగతుడైన యోగి ఉత్థానుడు కావడానికి వీలుండదు. కనుకనే నిర్వికల్ప సమాధిలో మనస్సు లయమవుతుంది (అంటే

అణిగి వుంటుంది) గాని నాశనం కాదంటారు. గమనించే అనుభవమూ, మనస్సూ రెండుంటాయి. అంటే ఆ సమాధి నూటికి నూరుపాళ్ళు నిర్వికల్పము కాదు అన్నమాట. కనుక అదే మోక్షము, నిశ్శ్రేయసము, కైవల్యము కాజాలదు.

'అలవాటు కాగా కాగా అదే నిలిచి వుంటుందనుకోండి. మరి అప్పుడో?'

ఒక వేదాంత గ్రంథము - వివేక చూడామణి - లో నిర్వికల్పసమాధిని మళ్ళీ మళ్ళీ పొంది దానిని నిత్యమూ నిలిచేటట్టు చేసుకోవాలి అన్నది చదివేను. ఈ ప్రక్రియ ఫలితాన్నే కాబోలు రమణమహర్షి 'సహజ (నిర్వికల్ప) సమాధి' అని ఉటంకించారు. అయితే, నిర్వికల్పసమాధి స్థితిని గురించిన వర్ణనలన్నీ సాధకుడు వైవిధ్యమేలేని ఏకత్వాన్ని అనుభవిస్తున్నట్లు చెపుతాయి. సహజసమాధి లోక వైవిధ్యము నడుమ నుంటూ రమణమహర్షివలె సర్వాన్నీ సమముగా చూడగలస్థితి. ఇది సంపూర్ణమైన స్థితీ, సమాధి లోని ఏకత్వాన్ని మాత్రమే చూచేది సంపూర్ణము కాదు అని అనిపిస్తున్నది. ఏమంటారా? తోతాపురిస్వామి రామకృష్ణ పరమహంస దగ్గరకు వచ్చేవరకునూ, వచ్చిన తర్వాతనూ, నిర్వికల్ప సమాధిస్థితిని - తాను రామకృష్ణస్వామికి చూపిన స్థితిని - చాలా చాలా మార్లు అనుభవించే వుంటారు. అయినా సేవకుడొకడు ఆయనగారి అగ్నిహోత్రము యొక్క కర్రలూ బూడిదా తీసివేయబోతూంటే 'దానిని నీవు ముట్టకు!' అని

అరచినారట. నాలుగు వందలమంది సాధకుల మఠానికి అధిపతి అయిన తోతాపురిస్వామికే చిరాభ్యాసమువల్ల నిర్వికల్ప సమాధిస్థితి సహజము అయి పోలేదూ, సమానత్వము రాలేదు. నౌకరు పేరూ తన అగ్నిహోత్రము మడి అయినాయి. అదే రీతిగా మనీషాపంచకము రచించని క్రితము ఆచార్య శంకరులకూ సమాధి సహజము కాలేదు. 'ఓ! చండాలుడా దూరంగా పో' అన్నారు *

'కనుక?'

కనుక కేవలము అడపాదడపా సమాధి స్థితిని అనుభవించడం మాత్రమే దానికి సహజము చేసుకోడానికి చాల లేదు కనుక, యోగికి, సమాధినుండీ లోకస్ఫురణ కలిగినప్పుడు ఆయన ఈ లోకదృశ్య వైవిధ్యము సమాధిస్థితిలోని ఏకత్వానిదే, దాని కంటే వేరుకాదు' అనే సత్యాన్ని నెమరు

---

* శ్రీశైల ప్రాంతములో కాబోలు కాపాలికుడొకడు "భైరవుని అర్చించడానికి నాకు ఒక సిద్ధపురుషుని శిరస్సు కావాలీ, మీకన్న సిద్ధుడెవరూ? స్వామీ! నా అర్చనకు సాయమనుగ్రహించండి" అని ఆచార్యుని కోరితే ఆయన "అట్లాగే తీసుకో; అయితే ఈ శిష్యకోటి ఆశ్రమములో లేని సమయము మట్టుకు చూసుకో" అన్నారట. ఇది సహజ సమాధిస్థితిలోనివారు అనగలిగినదే కదా? అయితే ఇది కాశీని శంకరాచార్యులవారు విడిచిన తరవాత కాలములో.

వేసుకుంటూ ఆ స్థితికీ ఈ స్థితికీ నడుమ ఉయ్యాల లూగు తున్నప్పుడు రెండు స్థితులూ వేరు వేరు అన్న ఇదివరకటి అభిప్రాయాన్ని తఱిగి తఱిగి క్షీణింపజేసి, 'కన్ను తెరిచి వున్నప్పుడు కనవడే వైవిధ్యమూ, కన్నుమూసి (సమాధి స్థితితో) ఉన్నప్పుడు తోచే ఏకత్వమూ ఒక్కదానివే అన్న తత్త్వమును సహజము చేసుకొనే స్థితి కూడ వున్నది' అంటాను. రమణమహర్షికి ఒకరు 'మీది ఏ సమాధి స్థితి?' అని అడిగినప్పుడు ఆయన అన్నారుట, 'ఇది వచ్చిపోయే స్థితి కాదు' అని. అమ్మను 'నీకు లోపల ఏ ముంటుందమ్మా?' అని కొబోలు అడిగితే అమ్మ "లోపలేదో వెలుపల అదే" అన్నారు. ఇదీ సహజ స్థితి. అమ్మ "నాకూ కాళ్ళ నొప్పులే" అన్నప్పుడు ఒకావిడ 'అవి బాహ్యానికేగా?' అంటే, అమ్మ "అంతరమంటూ (వేరే) ఉంటేగా?" అన్నారు. ఆమెగారికి బాహ్యమూ అంతరమూ రెండు కాదు. ఒక నాడు నేను అన్నాను అమ్మతో 'అమ్మకి తానే అయివుండడానికంటే లోకం వైపు చూడడానికి ఎక్కువ కాలము ఖర్చుఅవుతున్నదమ్మా' అని. అమ్మ వెంటనే అన్నారు "ఈ వ్యాపారంలో లాభ నష్టాలు లేవు నాన్నా" అని. తానే అయి వుండడమూ, లోకం వైపు చూడడమూ రెండూ ఒకటే అమ్మకి. ఇది సహజస్థితి. దీనికి మరి మార్పు లేదు. నిర్వికల్ప సమాధినుండి లోక స్ఫురణకు దిగడము అన్నది ఆధ్యాత్మికంగా అవరోహణమే. సహజస్థితి నుండి అవరోహణము అన్నదే లేదు.

'ఎవరన్నారూ?'

అమ్మ అన్నారూ, మహర్షికూడా అన్నారు. "సర్వకాల సర్వావస్థలలోనూ సమాన స్థితే సమాధి" అన్నారు అమ్మ. సమాన స్థితినుంచి దిగడమూ, ఎక్కడమూ అన్నది లేదుగా? నిర్వికల్పము అలాంటిది కాదు. "ఇంద్రియాలను లోపలికి తిప్పితే వస్తుందీ కొంతసేపటికి పోతుంది....అణగడమూ లేవడమూ వున్నంతవరకూ సాధక స్థితే[1]." అన్నారు రమణమహర్షి.

'నిర్వికల్ప సమాధికూడ సాధక స్థితేనా?'

మహర్షి ఆ మాటే కదూ అన్నదీ? అమ్మ ప్రాణాయామ కుంభక స్థితిని ఒకమారు ఒకసోడాబుడ్డి గోళీ ఒత్తిడితో పై కెక్కినట్లు అన్నారు. ఒత్తిడి లేనప్పుడు గోళీ క్రిందకు పడుతున్నది. ఆ ఉదాహరణ నిర్వికల్ప స్థితికీ వర్తిస్తుందనిపిస్తుంది నాకు. పడటము అంటే సమాధి నుండి లోకములోని వైవిధ్య స్ఫురణకు దిగడము అన్నమాట. పడడమూ, లేవడమూ సహజ సమాధి స్థితికి లేవు.

'అంతకంటె పై స్థితి లేదా?'

సహజ సమాధి కంటేనా? అంతకంటె మరి లేదు.

---

1. రమణాశ్రమ లేఖలు, 3వ భాగము, 94వ పుట.

'విదేహ ముక్తి'

"సహజస్థితిలోని వారికి శరీరమూ తానుగానే తోస్తుంది" అన్నారు మహర్షి[1a]. "శరీరము ఆత్మ కాదంటారుగాని అదిన్నీ ఆత్మ కాక పోలేదు" అన్నారు అమ్మ. ఈ శరీరము ఆత్మ కానే కాదనుకునే వారికి 'దేహము పడిపోతేనేకాని ఆత్మకు బంధము పోదు' అని అనిపిస్తుంది. "ఉన్నదంతా అదే, నామరూపాలు మాత్రమేకాదు-సముద్రములోని కెరటాలకూ, బుడగలకూ, సుడులకూ, గుడ ప్రవాహాలకూ, అయినను కొందఱకులాగ;" అని అనుకునే వారికి శరీరపతనము శరీరము వున్నప్పటిస్థితి కంటె వేరేమీ కాదు, కనుక విదేహముక్తి అన్నది సహజసమాధికి పై మెట్టవుతుందా? కాదు.

'అన్నట్టు అడగడము మరిచాను. మీరు 'నిర్వికల్ప సమాధి స్థితిలోని ఏకత్వాన్ని సమాధి లేనప్పటి వైవిధ్యాన్ని యోగి అన్నవాడు యత్నించి సమానము చేసుకోవాలి' అనేసి, నిర్వికల్ప సమాధి స్థితికి సహజస్థితికి నడుమ సాధన ప్రక్రియ ఏదో ఒకటి చెప్పేరే, అది మీ స్వంత అభిప్రాయ మేనా లేక ఏ యోగైనా చేసిన ప్రక్రియా?

రమణమహర్షి తిరువణ్ణామలై చేరినప్పటినుంచి ఆశ్రమములో స్థిరపడేవరకూ ఈ సాధనే - నిర్వికల్ప సమాధిలో తోచే ఏకత్వాన్ని కేవల లౌకిక దృష్టికి తోచే వైవిధ్యాన్ని

---

1a. రమణాశ్రమ లేఖలు 3వ భాగము, 18వ పుట.

దగ్గరకు చేర్చుకుంటూ ఎక్కడమూ దిగడమూలేని సమాన దృష్టి నలవరచుకునే సాధన – చేశారు.

'అలాగ అనడానికి మీకాధారమేమిటీ? ఆయన మధుర లోనే - మృతిపొందేననుకున్నప్పుడే - ఆత్మ సాక్షాత్కారము పొందేరనే ఆయన అనుచరులందరి విశ్వాసము. మీరు బయలుదేరి తిరువణ్ణామలై చేరిన రమణమహర్షిని సాధకుని దశకు దింపితే ఎవరేనా హర్షిస్తారా, ఆమోదిస్తారా?'

మహర్షిని దింపగలవారొకరున్నారా? నేను ఆయన ఆధ్యాత్మిక స్థాయిని దింపినాననుకొని సంతోషించాలని ఉద్యమించడములేదు. నా అనుమానము ఆయన సాక్ష్యము మీదనే ఆధారపడినట్టిది వినండి. రమణాశ్రమ లేఖలు మూడో భాగము 21వ లేఖలో "....నిర్వికల్పమంటే వాసనావశమై, విజృంభించే మనస్సును బలాత్కారంగా అణచి సమాధి నిష్ఠుడు కావటం. ఆవిధంగా చేసేవారు కదలక మెదలక కొంతసేపు వుండి యథాప్రకారం బాహ్యస్ఫురణకు వస్తారు" అన్నారు మహర్షి. ఆయనకు మధురలోనే సమాధినిష్ఠ అలవడింది. మళ్ళీ ఒకసారి ఆ నిష్ఠకు ఆయన ఉద్యమిస్తుంటే ఆయన అన్నగారు 'ఇలాటి యోగీశ్వరులు అడవులలో తపస్సు చేసుకోక ఊళ్ళలో ఇదేమిటీ?' అని కాబోలు వెటకారం చేశారు. దానితో ఆయన తిరువణ్ణామలై చేరేరు. పాతాళగృహములోనో విగ్రహాల వెనకనో మళ్ళీ మళ్ళీ నిర్వికల్ప సమాధి నిష్ఠలతో కాలము గడిపేవారు. అలాగని

ఆయనే చెప్పేరు. అప్పటికివారు సమాధినిష్ఠను సహజము చేసుకోలేదు. "నిష్ఠనుండి జారటం పట్టుకోవటం ఉన్నంత వరకూ సాధకులేగాని సిద్ధులుకారు" అని వారే చెప్పేరు (ర. లే. 3. 68వ పుట). మహర్షి విరూపాక్షగుహలో వుండిన కొంతకాలము వరకున్నూ, సమానమే అయి, ద్వంద్వాల వల్ల ప్రభావితము కానటువంటి సహజ సమాధినిష్ఠ వారికి రాలేదు. వారే చెప్పారు - ఒకాయన 'గగుర్పాటు కంఠ గాద్గదికమూ ఆనంద బాష్పాలూ మొదలైనవి ఆత్మ విద్యా విలాసములో చెప్పడ్డాయే అవి సమాధిస్థితిలోనా, ముందా, తర్వాతనా కనపడేది? అని అడిగినప్పుడు "ఇవి చాలా సూక్ష్మమైన మనోవృత్తులు, ద్వంద్వాలు అతిక్రమిస్తే అవి వుండవు. సమాధి అతి ప్రశాంతమైన స్థితి, దానిలో వీటికి చోటు లేదు. నిర్వికల్ప సమాధినుండి బయటికి వచ్చిన తర్వాత ఆ స్థితి జ్ఞాపకము వస్తే ఈ చిహ్నాలు కనబడతాయి. భక్తిమార్గములో ఇవి సమాధికి ముందు వస్తాయి. వ్యక్తి ప్రత్యేకమన్నది పూర్తిగా పోతే వీటికి అవకాశమే లేదు. అది ఏపాటి యోగికివున్నా ఈ చిహ్నాలు కనిపిస్తాయి. మాణిక్యవాచకులూ, ఇతర మహాత్ములు ఈ చిహ్నాలమాట చెప్పేరు. నేను విరూపాక్ష గుహలో వుంటూండినపుడు నాకు ఈ అనుభవమే కలిగింది? [2]" అని. రమణస్వామి తిరువణ్ణామలకు వచ్చినది 1896 లో. విరూపాక్షగుహలో

2. Talks with Sri Ramana Maharshi Vol. II, 23-2-37.

వుండినది 1899 నుంచి. అప్పటికి వారు పూర్తిగా, అంటే నూటికి నూరుపాళ్ళూ ద్వంద్వాతీతులు కాలేదన్నమాట. ఆయన విచార మార్గంలో (కేవల) నిర్వికల్ప సమాధి అనుభవమును ఎన్నో మార్లు పొందినారు పాతాళగృహంలో, వేర్వేరు గుహలలో విరూపాక్ష గుహలోనూ. (కేవల) నిర్వికల్పసాధనకు మరుగూ, ఏకాంతమూ అవసరము. యోగ సాధననుగూర్చి చెప్పినప్పుడల్లా ఈ నియమాలు చెపుతాయి శాస్త్రాలు. విరూపాక్ష గుహ చేరేటప్పటికి రమణస్వామి స్థితి బొత్తిగా ప్రారంభస్థితి కాదుగా? తల్లీ, శిష్యులు కొందరు, ఎచ్చెమ్మవంటి భక్తులు ఆయన దగ్గర చేరేరు. ఈయన సమాధి ఏకత్వానుభవాన్ని పొందుతూనే వుండినా ఆ ఏకత్వాన్నే వెంటబెట్టి ఏదో గుహలో కూర్చుని అవధూత అయిపోలేదు. జాగ్రత్‌స్థితిలో కనబడే వైవిధ్యము వదలి సమాధి ఏకత్వాన్ని చూచారూ, మళ్ళీ వైవిధ్యానికి వచ్చి ఆ ఏకత్వమే లోక వైవిధ్యంగా మారిందనీ చూచారు. అలాగ ఎందుకంటున్నానో చెపుతా. చిఱుతపులి నీరు త్రాగడానికని తామున్న గుహకు చేరువగా వస్తే దానిని సిద్ధుడు అన్నారు. అది రెచ్చగొట్టితేనే తిరగబడుతుంది అన్న సత్యమును గుర్తించి మనము కూ్రరమృగము అనేదానిలో సిద్ధుడిని - ఏకత్వమును గుర్తించిన జీవిని - చూచారు. భిక్షవల్లగాని భక్తులనుంచిగాని లభించిన ఆహారాన్ని ఎంతమందివుంటే అంతమందికి పంచి సర్వులలోనూ అభేదము-అందరూ ఒకదానివాళ్ళే అని-చూచారు. సమాధి అనుభవాన్ని అదే పరమగతి అని వెంట

బెట్టితే ఈ సంసారమంతా ఎందుకూ ఆయనకూ? తరచు తన చుట్టూవున్నవారికి తానే వండిపెట్టేవారట కూడానూ! కనుక వీరిదారి శాస్త్రాలలో చెప్పిన యోగుల - నిర్వికల్ప సమాధి పొంది ఆ తర్వాత బ్రహ్మవిదులమూ, బ్రహ్మవిద్వరులమూ, బ్రహ్మ విద్వరిష్ఠులమూ అవుదామనున్నవారి - దారి కాదు అంటున్నాను. సమాధి అనుభవ ఏకత్వాన్ని వెంటబెట్టి అటు వెళ్ళిపోతే దీయున. లోకవైవిధ్యము లోనికివచ్చి, సమాధి ఏకత్వమే ఈ వైవిధ్యము అని గుర్తించుకున్నారు. 'మనిషికీ, మనిషికి తేడా ఏమిటి! అంతా భగవత్స్వరూపమే' అని కట్టెలు తెచ్చిన మాలవాడికి తనకన్నా ముందుగా అన్నం పెట్టించారు స్కందాశ్రమములో వున్నప్పుడు. ఎవరో భంగు తెచ్చి వుంచితే 'అది ఎవరికి యిష్టమో వారిని సేవించని'మ్మన్నారు. మంచీ చెడ్డా అన్నవి మన ఆలోచనల్ని బట్టే; వాస్తవానికి అంతా పనికి వచ్చేదే, బ్రహ్మమే. ఒకనాడు ఫలాహారాలు ఎక్కువైపోతే మర్నాడు ఉపవాస ముందామని ఒక రోజున చుట్టూవున్న వారి దగ్గరనుంచి తప్పించుకొని అడవిలోకిపోయి అక్కడా పరిస్థితులు తనకు ఎదురు తిరిగితే, భోజనాది నిత్య వ్యవహారములలోనున్నా "అనుకున్నది జరగదు తనకున్నది తప్పదు" అని తెలుసు కున్నారు. ఇది సహజ సమాధిస్థితి కాదుగా? ఈ రోజుల్లో ఈయనకు సమాధి స్థితిని జ్ఞాపకము చేసుకున్న క్షణాలలో ఆనంద బాష్పాలుకూడా వచ్చేవట. అది ద్వంద్వాలు మిగిలి వున్న స్థితే అని వారే చెప్పేరు.

'ఇంతకీ మీరు ఏం తేల్చానంటారు?'

తక్కిన యోగులవలె రమణమహర్షి నిర్వికల్పము పొందిన తర్వాత లోకాన్ని (వివేక చూడామణి 288వ శ్లోకంలో చెప్పినట్లు) పొమ్మనలేదు, శరీరాన్ని చండాలునివలె దూరము చెయ్య (289వ శ్లోకం) లేదు. బ్రహ్మాండమూ, పిండాండమూ త్యజించ (290) లేదు, ఇతరుల శరీరాన్ని మిథ్యలని ఉపేక్షించ (294) లేదూ, బహిః ప్రపంచాన్ని నిరోధించ (337) లేదు, మరి, 'నేను' అని అనుకొనేదే అన్నీ అయివున్నదని అడుగడుక్కీ తెలుసుకుని సమాధిని సహజము చేసుకున్నారు. కనుక, నిర్వికల్ప సమాధిలోనే సర్వకాలమూ ఉండడము కాదు జీవిత గమ్యమూ, సహజ సమాధే గానీ అంటాను. ఇది అరూపియైన సమాధి ఏకత్వాన్ని సరూపి అయిన జగత్ వైవిధ్యాన్నీ చేర్చుకుని ఏకము చేసుకున్న స్థితి. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' – జగత్తూనూ' – అన్న స్థితి. సమాజానికీ సామాన్య జీవితానికీ దూరంగా వుంటేనేగాని నిర్వికల్ప సమాధి సాధన సాగదు. దానికి మఱుగూ, ఏకాంతవాసమూ అవసరము. సహజ సమాధికి యత్నము అక్కరలేదు. ఆశ్రమములో వున్నప్పుడు మహర్షి చెప్పేరు ఈ మాట. ఆయనకు ఏకత్వ మననము వల్లనే నిర్వికల్పము సహజమైంది అంటున్నాను.

'అంతర నిర్వికల్పమే బాహ్య నిర్వికల్పమైనదనకూడదా?'

చక్కని ప్రశ్న 'అంత మాత్రము అనడము చాలదు' అని జవాబు. వివరంగా మనవి చేస్తాను వినండి. నిర్వికల్ప సమాధి అంటే ఇంకొక వికల్పములేని స్ఫురణ. రెండు ఆలోచనల నడుమ మనం ఉండే స్థితి నిర్వికల్ప సమాధి యొక్క తునక. దానిని ఇటూ అటూ బాగా పెంచితే అదే సమాధి అవుతుంది. ఆ స్థితిలో ఇంద్రియాల మెలకువ అన్నది, స్ఫురణ ఒకవైపుంటే దానికి వ్యతిరేకంగా తిరిగి వుంటుంది (అందాం). దాన్ని బయటనుంచి తట్టకపోతే స్ఫురణ కొంత సేపుంటుందీ తరవాత దిగిపోతుందీ ప్రపంచ జాగ్రత్త వచ్చేస్తుంది. 'చిరాభ్యాసమువల్ల సమాధిలోని ఏకత్వస్ఫురణే సాధకుణ్ణి నింపేస్తుందీ అతడు బ్రహ్మ మయుడే అయిపోతాడూ' అంటాయి వేదాంత ప్రకరణ గ్రంథాలు [3]. ఇది ఆంతర నిర్వికల్పము. 'లోపలి దృశ్యాల్నీ శబ్దాల్నీ చూచే ఆత్మ స్ఫురణే ఆంతర నిర్వి కల్పము అంటుంది సీతారామాంజనేయ సంవాదము. ఈ స్థితిలో ఇంద్రియాల మెలకువ అతి హీనంగా అయినా ఉంటూనే ఉంది అని జ్ఞాపకము పెట్టుకొండి. ఇక బాహ్య నిర్వికల్పము, ఆంతర నిర్వికల్పము యొక్క బాహ్య ప్రతిబింబము. బాహ్యశబ్దాలనూ దృశ్యాలనూ గుర్తించే ఆత్మయొక్క స్ఫురణ' అని వివరిస్తుంది సీతారామాంజ

---

3. వివేక చూడామణి, సర్వ వేదాంత సిద్ధాంత సార సంగ్రహము వంటివి.

నేయము. 'తరంగాలు లేని సముద్రాన్ని చూస్తున్న స్ఫురణ' అనీ అంటాయి వేదాంత గ్రంథాలు [4]. అంటే, నామ రూపాల వెనక వున్న సత్తను చూస్తున్న స్ఫురణ అన్నమాట. మీరు అన్నట్టుగా ఈ రెండు నిర్వికల్పాలూ ఏక కాలంలో ఉన్నాయి అనుకుందాం. సాధకుడికి బయటా లోపలా ఆత్మ గానే ఉన్న స్ఫురణ వుంటుందీ, ఇంద్రియాల మెలకువ అతిక్రొంచెమూ, బయటి వస్తువుల నామరూపాలు అణిగి పోయీ ఉంటాయి. ఇది సహజస్థితి కాదు, యత్న లభ్యమే. దీనినుంచి లోక స్ఫురణకు దిగవలసినదే సాధకుడు. ఊపిరి బిగిస్తే ఊహలు అణిగి, ఊపిరి వదిలేస్తే మళ్ళీ వచ్చినట్లే ఈ నిర్వికల్పద్వయము. ఇక సహజ స్థితి ఏదీ అంటే, నామ రూప విశిష్టమైన జగత్తూ అరూపి అయిన సమాధి చైత న్యమూ ఒకే సర్వముయొక్క, - ఒకే బ్రహ్మయొక్క నైజము అని చిర మననమువల్ల తెలుసుకునే యోగియొక్క సమానస్థితి. రమణ మహర్షికి - సమాధిస్థితి అతి శీఘ్రముగా అలవడినట్లే - సహజస్థితీ త్వరగానే వచ్చింది. ఆయన నామ, గుణ, రూపాల్ని పరిహరించలేదు. 'అస్తి భాతి ప్రియము నామము రూపము అన్నీ చేరి - ఇదం సర్వం ఖలు - బ్రహ్మ' అనే తెలుసుకున్నారు. 'మీరు భోజనంచేసి

---

4. రమణాశ్రమ లేఖలు, మూడో సంపుటము 49వ పుట.

వెళ్ళండి' అంటూనే 'ఎక్కడ తిన్నా తినేది ఆ ఒక్కడే' అని ఎరిగిన స్థితి వారిది. ఇదీ జీవిత గమ్యము, సహజస్థితి. (కేవల) నిర్వికల్పము కాదు.

'మహర్షి ఒక్కరేనా ఈ స్థితిని సాధనచేసి పొందినది? పూర్వ ఋషు లెవరేనా పొందేరా?'

# ఉపనిషత్
# ఋషుల సహజసమాధి సాధన

'నిర్వికల్పసమాధి' అనే అనుభవమును పొందినవారు ఆ స్థితిలో పరమానందంగా ఉండి మళ్ళీ లోకస్ఫురణ కలిగే మన మామూలు స్థితికి వస్తారు. మళ్ళీ ఇంకొకసారి మనస్సునీ వాసనలనూ లాగిపట్టి సమాధిస్థితి అనుభవిస్తారూ మళ్ళీ లోకస్ఫురణకి వస్తారు. కనుకనే కఠోపనిషత్తు (2-3-10)లో "ఎప్పుడు జ్ఞానమూ మనసూతో బుద్ధికూడా నిశ్చలంగా కూర్చుంటుందో దానినే "పరమాగతి' అంటా[5]"రూ అనీ "అప్పుడు అప్రమత్తత వుంటుంది[6]" అనీ చెప్పి,

---

5. యదా పంచావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ। బుద్ధిశ్చ న విచేష్టతి తామాహుః పరమాంగతిమ్.
6. అప్రమత్తస్తదా భవతి.

కనుక "యోగము వచ్చేది పోయేదీను (2-3-11)"[7] అన్నారు. అంటే సాధకుడికి ఈస్థితి పైకి ఎక్కడమూ పడడమూ లాటిదే. "సమాధి స్థితి యందున్న వారికి మనస్సు బహిర్గతమైన ప్పుడు తిరిగి తిరిగి లాగి పెట్టుకోవలసి వుంటుంది. జారటమూ వట్టుకోవడమూ ఉన్నంతవరకూ సాధకులేగాని సిద్ధులు కారు" అన్నారు రమణమహర్షి. ఈరీతిగా జారడములేకుండా 'అంతా అదే' అన్న సహజసమాధిస్థితిలో వుండేవారిది అమ్మ చెప్పినట్లుగా "సర్వకాల సర్వావస్థలయందూ సమానస్థితే." నిర్వికల్ప సమాధి అనే యోగము వచ్చి పోయేది కనుక, అలా పోకుండా సర్వసమాన స్థితే నిలిచి వుండేందుకు ఏదైనా సాధన అవసరమా కాదా? అంటే, సమాధిలో అనుభవమయ్యే ఏకత్వానికీ మామూలు దృష్టికి కనపడే వైవిధ్యానికీ సమన్వయము కలిగించే సాధన ఒకటి లేకపోతే తీర్థానికి తీర్థమూ ప్రసాదానికి ప్రసాదమూగానే వుంటాయి సమాధిలోని ఏకత్వ దృష్టి, లోక వైవిధ్య దర్శనమూను. రమణ మహర్షి విరూపాక్ష గుహలో పై రెంటినీ కలుపుకునే సాధనచేసి వుండాలి అన్నాను. పూర్వఋషులూ ఋషితుల్యులూ అలాటిది చేసినట్లు సాక్ష్యమున్నదా అని ప్రశ్న. ఉపనిషత్తులలో వెతుకుదాం. దేనిని వెతకాలి?

మొదట సమాధిస్థితిని పొందడానికి యోగులు చేసే సాధన మాట ఉన్నదా అని వెతకాలి. అది వుంటే వారు

---

7. యోగోహి ప్రభవాప్యయౌ.

సాధన చేసే వుంటారూ, ఎప్పుడో ఒకప్పుడు సమాధి అనుభవము వచ్చే ఉండాలి గదా! కనుక ఈ అనుభవాన్ని వర్ణించినట్లున్న భావాల్ని తరవాత వెతకాలి. ఆ తరవాత సమాధిస్థితి జారుతూ లోక వైవిధ్యము క్రమంగా గుర్తుకు వచ్చే అవరోహస్థితికి చెందిన ఊహలు వెతకాలి. చివ్వర 'సమాధి అనుభవాన్ని సామాన్య అనుభవాన్ని ఏయే రీతులలో అన్వయించుకున్నారూ ఉపనిషదృషులూ?' అన్నది వారి అన్వయ వాక్యాల్నిబట్టి చూసుకోవాలి. ఈ అన్వయాలలో సర్వసమానస్థితి ఉన్నదా అని అప్పుడు తెలుస్తుంది. ఉపనిషదృషులు సహజస్థితి కోసము చేసిన సాధన.

కఠోపనిషత్తులో "చక్షువులను అమృతత్వముకోరి లోనికి త్రిప్పి ప్రత్యగాత్మను చూస్తాడు[8] (2-1-1) అన్నారూ ఈ సాధనను అధ్యాత్మయోగ మన్నారు[9] (1-2-12) ఈ యోగ విధిచేత నచికేతుడు బ్రహ్మమును పొందేడూ ఇంకెవరేనా పొందవచ్చును[10]" అన్నారు. శ్వేతాశ్వతరములో "వారు ధ్యానయోగానుగతులై దేవాత్మశక్తిని చూచార[11]"న్నారూ (1-3) తమస్సు కావల ఆదిత్యవర్ణుడు ఈ

8. కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష దావృత్త చక్షు రమృతత్వ మిచ్ఛన్
9. అధ్యాత్మ యోగాధిగమేన
10. అన్యోప్యేవం యో విదధ్యాత్మమేవ.
11. తే ధ్యానయోగానుగతా అపశ్యన్ దేవాత్మశక్తిం.

మహాంత పురుషుని నేను తెలుసుకున్నాను[12]" అన్నారు. ఇంకా ఎన్నో ఉపనిషత్తులలో యోగమును గురించి చెప్పి వున్నారు. కనుక యోగసాధన ఉపనిషత్కాలములో ఉండినది అని నిశ్చయమే.

ఇక నిర్వికల్ప సమాధిస్థితిలోని అనుభవవర్ణనకు వెతుకుదాం. యోగానికి తొలిప్రక్రియ ఇంద్రియాలను దృష్టిని - అంటే గమనికను - లోపలికి త్రిప్పడము. కఠోప నిషత్తు ఈ పనినే 'ఆవృత్తచక్షుః' అని వర్ణించింది. కన్ను మూసి ఏ దృశ్యాలూ రాకుండా మనస్సునుపట్టి నిరోధిస్తే కంటికి అగుపడేది తమస్సు. ఇది అందరికీ అగుపడుతూ ఉంటుంది. బెర్ ట్రాండ్ రసెల్‌కి ఇదిమాత్రమే కనపడిం దట. తరువాత సాధకుడు చేసేది ధ్యానము. దేనిని గురించీ అన్నవారికి పతంజలి యోగసూత్రాలలో చాలా చెప్పేరు. ఈ ధ్యానములో తక్కినవన్నీ తొలగిపోయి, మాటా (లేకపోతే జ్యోతి, లేక నాదమూ, దేనిని గమనికలో నిలిపితే అదీ) దాని అర్థమూ, సాధకుని 'నేను' అన్న స్ఫురణా అన్న మూడూ నిలిచివుండే స్థితిని సవికల్ప సమాధి అన్నారు వేదాంతులు. యోగులు ఈ నిలిచివుండే స్థితి - 'సమాధి' అన్న దానిని సవితర్క, నిర్వితర్క, సవిచార, నిర్విచార, సంప్రజ్ఞాత అంటూ ఇంకా సూక్ష్మ

12. వేదాహమేతం పురుషం మహాన్తమాదిత్య వర్ణం తమసః పరస్తాత్.

భాగాలు చేశారు. ద్వాదశోపనిషత్తులలో ఈ విభాగాలు గాని 'సమాధి' అనే పదముగానీ కనపడదు. ధ్యాన యోగము అనే మాట కనిపిస్తుంది, యోగ ప్రక్రియలోని ఘట్టాలు కొన్ని కనిపిస్తాయి. వాటినిబట్టి యోగవిధీ, ఆ ఘట్టాలూ గుర్తుపట్టే ప్రయత్నము మనము చేద్దాము అంటున్నాను. శ్వేతాశ్వతరుడు యోగి. యోగాన్ని బాగా చెప్పేడు శ్వేతాశ్వతరోపనిషత్తులో. "తమస్సు కావల ఆదిత్యవర్ణుడు, ఈ మహాంతపురుషుని నేను తెలుసుకున్నాను" అన్నాడూ, "తమస్సుపోతే (4-18) [13] శివుడే" అన్నాడు. రెండుమారులు 'తమస్సు' 'తమస్సు' అంటూ వర్ణించిన చీకటి యోగ ప్రారంభదశలో కన్నుమూసినప్పుడు కనబడే చీకటేననీ, చివ్వరకు సాధకుడు పొందే "ఆదిత్య వర్ణు"ని అనుభవమే నిర్వికల్ప సమాధి అనుభవమనీ గుర్తించుకోవచ్చును అని అంటున్నాను. యోగప్రక్రియలోని మెట్లు ఈయన వర్ణించ లేదు (పతంజలివలె). 'చీకటీ లేదు, వెలుగూ లేదు, శివుడే' (4-18) అన్నది గమనిస్తే ఈయన 'ఆదిత్యవర్ణుడు,' 'మహాంత పురుషుడు' అని అన్నది (నిర్వికల్ప) సమాధి ఏకత్వాన్నే అనీ' ఈయన శివయోగి కావడముతో ఆ అనుభవాన్ని శివుడుగా అన్వయించుకుని చెప్పేడని నాకు స్ఫురిస్తున్నది. మొదటలో "వారు దేవాత్మ శక్తిని చూచారు" అన్నాడు గుర్తించండి. ఆ దేవాత్మశక్తీ, ఆదిత్యవర్ణుడూ,

---

13. యదా తమస్తన్న దివా న రాత్రిః

శివుడూ అన్నీ యోగఫలము అయిన నిర్వికల్ప సమాధే అంటున్నాను. ఈయన శివుని రూపాన్ని ధ్యానించివుంటే 'దేవాత్మశక్తి' అని అననక్కరలేదు.... శ్వేతాశ్వతరుడు చెప్పిన 'ఆదిత్య' వర్ణము ఇతరుల వర్ణనలలోనూ కనిపిస్తుంది చూడండి. (నిర్వికల్ప) సమాధి అనుభవము కన్నుమూసి నప్పటి చీకటికి అవతలిది. అది అభావము (ఏదీ కానిది) మాత్రము కాదు. ఈ అనుభవము అందక ముందుండిన చీకటితో దానిని పోల్చి, ఈ అనుభవాన్ని 'వెలుగు' అన్నా రని నా కనిపిస్తున్నది. ఏమంటే మామూలు దృష్టికీ, చెవికీ, శరీరానికీ అందే వెలుగూ శబ్దమూ స్పర్శా పరిహ రించికదా ధ్యానమూ చేశారూ? ఇంద్రియాలకు గోచరించే వెలుగూ నాదమూ వంటిది కాదు సమాధి అనుభవము. అయితే, వర్ణించినప్పుడు ఇంద్రియగోచర విషయములను దాటి మాటలు పోలేవు. కనుక 'వెలుగు' అన్నారు చాలా ఉపనిషత్తులలో. కఠ మహర్షి మొదటలో "ప్రత్యగాత్మను" ఎవడో ధీరుడు చూస్తాడు అన్నాడూ, శ్వేతాశ్వతరుడు దానినే 'దేవాత్మశక్తి' అన్నాడూ, దానినే మళ్ళీ 'ఆదిత్య వర్ణం' (3-12) అన్నాడూ, చాలా ఉపనిషత్తులు 'శుక్రం' అన్నాయీ, అది సమాధి అనుభవమే అంటున్నాను. ఆ వెలుగులో వైవిధ్యమే లేదు. దానిని (అంటే 'ఆత్మ'ను) "ఏకమ్" అన్నది ఈశావాస్యోపనిషత్తు (4). ఒకడు [14]

---

14. ఏకో వశీ

అన్నది కఠోపనిషత్తు (2-2-12). "అది ఒకటే" 15 (1-3) అన్నది శ్వేతాశ్వతరం. పాశ్చాత్యులలో తురీయానుభవము పొందిన ప్లోటినస్సూ, రైజ్బ్రూక్ వంటివారు ఈ ఏకత్వాన్నే చెప్పేరు. (Teachings of the Mystics) అనేకుల వర్ణనా సామరస్యాన్నిబట్టి వస్తువదే, (నిర్వికల్ప) సమాధి వర్ణనే అంటున్నాను.

'ఏకమ్ అనడముతో సంతుష్టి పడక, అకాయమస్నాయు మవ్రణం" (ఈశా) అన్నారు. దానిమీదగాని నరముపంటి గీతవుంటే ఆ నరానికి ఇటువైపూ అటువైపూ అన్నదేశ భేద ముంటుంది. కనక ఈ 'జ్యోతిషాం జ్యోతి (ముం. 2-2-10)' అస్నాయువు. వ్రణమువంటి చుక్క ఉంటే, 'దానిలో ఇదిగో ఇక్కడ' అని ఒకచోటు నిర్దేశించ డానికి వీలు. అదీ కనపడదు 'అవ్రణమ్' కనుక. ఇక కాయమూ పరిధులూ లేవు. అది మాత్రమే ఉన్నది. మహాంతం. "నిష్కలం, నిష్క్రియం శాంతం నిరవద్యం" (శ్వేతా. 6-19), "అకాయం, శుద్ధం" (ఈశా. 8). ఇది సమాధిలో అనుభవించిన ఏకత్వవర్ణనే దయచేసి గమనించండి అంటున్నాను. ఇంకా చూడండి. "అతనిపైన సూర్యుడు ప్రకాశించడు; చంద్రనక్షత్రాలూ విద్యుత్తు

---

15. త మేక నేమిం.

అయిననూ (శ్వేతా 6-14). జ్యోతిషాం జ్యోతికదా! దానిని వెలిగించేది ఏది ఉండగలదూ? ఈ వూహలు తక్కిన ఉపనిషత్తుల్లోనూ కనిపిస్తాయి.... "అది చలించదు" అంటుంది [16] ఈశావాస్యము. 'ఉన్న అవకాశమంతా అదే ఆక్రమించి వున్నప్పుడు చలించడము సాధ్యము కాదు' అనడము ఒకటి. 'అది చలనశీలి కాదు, అచంచలము' అనడము రెండు." చెట్టువలె స్తబ్దముగా దివిని కూర్చుని ఉన్నాడు"[17] అని ముండకమూ (1-1-7) శ్వేతాశ్వతరమూ (3-9) అన్నాయి. ఇవి సమాధి అనుభవ వర్ణనలే చూడండి అంటున్నాను.

సమాధి స్థితిలో అంతా తానే అయివుండిన ఆ తేజస్సు పైన ఈ లోకవైవిధ్యము క్రమంగా తేలుతుంది జాగ్రత్ స్థితికి రావడములో. మనము దట్టమైన పొగమంచులో ప్రవేశించా మనుకుందాము. మనచుట్టూ తెల్లగా ఆ మంచు ఆవరించి వుంటుంది. అది తప్ప వేరేదీ కనిపించదు. అలాగే (నిర్వికల్ప) సమాధి స్థితిలోని యోగికి, ఆత్మ - దేవాత్మశక్తి - జ్యోతి - ఆ అనుభవము ఏదో అదే స్ఫురిస్తుంది. ఆయున జాగ్రత్ స్థితికి రావడమన్నది మన ఉదాహరణములో మంచు పడిపోవడము వంటిది. అలా విడుతూంటే చెట్ల గుబురులూ స్కంధాలూ ఇంకా ఇళ్ళుంటే అవీ ఆ పొగమంచు పలచనయ్యే కొద్దీ లీలగా ఇంకా నల్లగా

---

16. అనేజదేకం

17. వృక్షఇవస్తబ్ధో దివి తిష్ఠతి. (ముండకము)

సైజులు పెద్దగా, అంచులు స్ఫుటంగా క్రమంగా తేల్తాయి. యోగి స్ఫురణలో ఆ అనుభవము వలచనై ఈ ప్రపంచము క్రమక్రమంగా పైకి తేలుతుంది. ఈ పరిణామ స్థితిలో సాధకునికి, ఏమి జరుగుతూన్నదనిపించవచ్చా? (1) ఆ (సమాధిలోని) ఏకత్వమే ఈ ప్రపంచముగా అయినది అని అనిపించవచ్చు. మారే ప్రపంచ స్ఫురణకు వెను దిరిగి చిరసాధనతో - అన్నారెడ్డిపాలెపు రామయోగిగారు పన్నెండేళ్ళు చేశారట ధ్యానము - ఆ ఏకత్వాన్ని దర్శించి అదే సత్యమూ నిత్యమూ అన్న నిశ్చయానికి వచ్చారు మరి. కనక ఆయన నమ్మకము ఆ 'ఆత్మ' సత్యత్వము మీద ఆధారపడే సాగుతుంది. ఇటుతర్వాత అంటే 'ఆత్మ అరూపీ, దాని దృశ్యరూపము విశ్వమూ,' అని అనుకో వచ్చు. పంచదార పాకము అరూపీ, కోటా చేపా పన్నిరు బుడ్డీ దాని రూపాలు అయినట్టు. (2) 'ఇది – ఈ ప్రపం చము – సృష్టి అవుతూంటే ఆ అనంతతేజము దీని లోపలా బయటా అంతటా ఆవరించి వుంటోంది' అనీ కావచ్చును. (3) అది వేరూ ఇది వేరూ అని కావచ్చు; మూడే వీలు. అది రూపమూ కాయమూ లేనిదన్నారు కదా? 'రూపము లేని అదే ఈ జగత్ రూపమూ ధరించింది' అని కొందరు యోగు లనుకుంటారూ, 'రెండూ చేరే సర్వమూ అయినది' అని కొందరనుకుంటారూ, రెండూ వేర్వేరు అని కొందరను కుంటారు. మొదటి రకము వారి ఊహ ఈశావాస్యములో

"అది చలించునూ చలించదూనూ"[18] (5) అన్నట్టిది. తేజస్సైన విశ్వమంతా తానే అయినప్పుడు చలించదు. స్థావర జంగమాలుగా అయినప్పుడు చలిస్తుంది. కనుకనే 'అది చలిస్తుందీ, చలించదూ' అన్నారు. ఈ సమ్మేళాన్ని ముద్ర గొట్టే భావాలుకూడా వచ్చేశాయి. ఇవి చూడండి:

"ఎవడైతే సర్వభూతములనూ ఆత్మయందే – అనగా ఆ తేజస్సుయొక్క రూపములుగానే-చూస్తున్నాడో, సమస్త భూతములందున్నూ – ఇవన్నీగా మారిన ఆ – ఆత్మను చూస్తున్నాడో వాడు (దేనినీ) అసహ్యించుకోడు" అని ఈశావాస్యము ఆరవ మంత్రమూ,[19] "ఎవడైతే అన్నిభూతములూ ఆత్మయందే పుట్టినవని తెలుసుకుంటాడో, అతనికి మోహమేమిటి? శోకమేమిటి? ఏకత్వము చూచేవాడికి?" అని ఏడవ మంత్రమూ [20] అంటున్నాయి. 'ఏకత్వము' అంటే అంతా అదే అనే తత్త్వమే, ఇంకేదీ కాదు. ఇదే స్థితి తైత్తిరీయములో (2-9) "బ్రహ్మణ్యుడు నేను మంచి

---

18. తదేజతి తన్నైజతి

19. యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే

20. యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూ ద్విజానతః
తత్ర కో మోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః

ఎందుకు చేసుకోనూ? పాపము చేస్తానేమీ? అని తపించడు. రెండు చేసేది ఆత్మే కనక" అని చక్కగా చెప్పబడింది.[21]

ఇదీ నిర్వికల్ప సమాధిని సహజము చేసుకునే మననము. ఆ సమాధిస్థితిలోనిది 'వర్యగా శుక్రం', అనంత తేజము. అదే ఈ సర్వభూతములూ అయినది. (దానివల్ల ఇవి వేరే పుట్టినవి అని కాదు దానియందు ఇవి పుట్టినవి అనీ. అందువల్ల 'సందులూ పందులూ దానియందు పుట్టినవే. దాని యందు ఏవగింపు ఎందుకూ?'. అని 'దేనినీ అసహ్యించుకోడు అది తెలిసినవాడు' అన్నారు. అన్నిభూతములూ ఆత్మయందే పుట్టినవని చక్కగా తెలుసుకున్నవాడు ఒక్క దానిమీద మోహము పెట్టుకోడు. "ఎక్కడికి పోయింది నాన్నా హైమ? [22] ఇక్కడే వుంది. ఛా. ఎందుకేడుపూ?" అన్నారు అమ్మ నరసింహమూర్తిగారితో. "మీరంతా పుట్టిన

---

21. ఆనందం బ్రహ్మణోవిద్వాన్, న బిభేతి కుతశ్చనేతి, వీతగ్ంహవావ న తపతి, కి మహగ్ం సాధు నాకరవం, కి మహం పాప మకరవ మితి, స య ఏవం విద్వానేతే ఆత్మానగ్గ్ం స్పృణుతే, ఉభే హ్యేవైష ఏతే ఆత్మానగ్గ్ం స్పృణుతే, య ఏవం వేద.

22. హైమ అమ్మ గర్భవాసాన పుట్టిన ఆడపిల్ల. పాతికేండ్లు నిండీ నిండక మునుపే వెళ్ళిపోయింది. నరసింహమూర్తిగారు అమ్మకు అనన్య భక్తులు. హైమ వెళ్ళిపోయిన సందర్భంలో ఆయన అమ్మను చూడబోయినప్పుడు అమ్మ అన్న మాటలు ఇవి.

దిక్కడనే. నేనే మీ తల్లులకు పెంపుడిచ్చాను" అన్నారూ "మీరంతా నేనే, మీ దంతా నేనే, ఇదంతా నేనే" అన్నారు. ఈ సర్వమూ "నేను నేనైన నేను" అన్నారు. మీరంతా సముద్ర తరంగాల్లాగ నా సంకల్పమువల్ల నాలో పుట్టి నాలో లయమౌతారు" అన్నారు. 'మీరు మాలో దైవాన్ని చూస్తారామ్మా?' అని ఒకామె అడిగితే అమ్మ, "మీలో కాదమ్మా, మీరుగా చూస్తాను" అన్నారు. ఇదీ 'సర్వమూ అదే' అన్న సర్వాత్మ భావము. ఈ భావము "స్వానుభూతిం పరిత్యజ్య న తిష్ఠన్తి క్షణం బుధాః" అన్న మాటలు పట్టుకుని కేవలము సమాధికీ లోకానికీ నడుమ ఊగిసలాడుతూనే ఉంటేనూ, "శుద్ధోహం, బుద్ధోహం, ప్రత్యగ్రూపేణ సిద్ధోహం" అనుకుంటూంటేనూ అలవడజాలదు. ఎంతకాలము "నేను స్థూలము కాను. సూక్ష్మముకాను, దీర్ఘము కాను, బాల యువక వృద్ధులు కానే కాను, గుడ్డీ మూకా షండా కాను" అని లోకానికీ లోకస్థులకీ వేరుగానే వుంటాడో సాధకుడూ, అంతకాలమూ తోతాపురికీ, జడభరతుడికీ దూర్వాసుడికీ లాగ సమాధిదారి సమాధిదీ లోకస్ఫురణదారి లోకస్ఫురణదీ అయ్యే వుంటుంది. కనుక, యోగి, - శ్వేతాశ్వతరంలో అన్నట్టుగా - సమాధిలో సర్వమూ అయిన ఆత్మయే ఈ జగత్తు సర్వమూ అయివచ్చినదన్న విశ్వాసముతో "అదే అగ్ని అదే ఆదిత్యుడు అదే వాయువు, అదే చంద్రుడు అదే వెలుగు అమృతము బ్రహ్మ నీరు ప్రజాపతి. నీవు స్త్రీ నీవు పురుషుడు నీవు కుమారుడవు కుమారివి నీవు కర్ర

పోటీసుకు నడిచే వృద్ధుడవు. నీవు నీలపతంగము, ఆకు పచ్చని ఎర్రికళ్ళ చిలుకవు. వర్ష మేఘానివి. ఋతువులు సముద్రాలు, విశ్వభువనాలు దేని నుండి పుట్టునో [23] అది నువ్వు" (4-2-3,4) అని మననము చేసుకోవాలి. సమాధి స్థితిలోని మహాంత తేజము అప్పుడు నిజమైనట్లే దానినుండి పుట్టిన విశ్వము జాగ్రత్తలో నిజము. మారనిదీ మారేదీ అయిన సర్వమూ నిజమే నన్న స్ఫురణ వున్నప్పుడే, 'అహం భోజనం నైవ భోక్తా, చిదానంద రూప శ్శివోహం శివోహం' అన్న అభిప్రాయము "అన్నం బ్రహ్మ భోక్తా బ్రహ్మ అహంచ బ్రహ్మ" అన్న మననము లోనికి క్రమంగా సమాజ సమాధికీ దారి తీయగలదు.

'అదీ ఇదీ ఒకటే అన్న అభిప్రాయాలు ఉపనిషత్తు లలో వున్నాయా?'

"ఈ జగత్తంతా ఏ కొంచమైనా ప్రాణమునుండి కదలి వచ్చినదే" అంటుంది కఠోపనిషత్తు [24] (2-3-2); "ఆత్మ ఇట కూర్చునే దూరంగా వ్యాపిస్తుంది" అంటుంది. (1-2-21). "అది దూరంగా వుంటుంది" దగ్గరగా

---

23. అనాది మత్త్వం విభుత్వేన వర్తసే యతో జాతాని భువనాని విశ్వా.

24. యదిదం కించ జగత్సర్వం ప్రాణ ఏజతి నిస్సృతం.

వుంటుంది అంటుంది [25] (5) ఈశావాస్యము. "అది దూరానికి దూరమూ దగ్గరకు దగ్గరగా" అంటుంది (3-1-7) ముండకము. ఇక్కడ కూర్చునే ఆత్మ వస్తురూపము; దూరానికి వ్యాపించేది అంతటా వున్నట్టిది. "ఇదం వరిష్ఠం విశ్వమ్ బ్రహ్మైవ" అన్నది ముండకము (2-2-12). శ్వేతాశ్వతరం "అపాణిపాత్ అయినా పట్టగల వాడూ జవనుడూ. అచక్షువైనా చూస్తాడు' కర్ణములు లేకున్నా వింటాడు" అని (3-19లో) నిరాకారాన్ని వర్ణిస్తూ "పురుషుడు సహస్రశీర్షుడు, సహస్రాక్షుడు, సహస్రపాత్" అనీ, "సర్వాననశిరోగ్రీవుడు అనీ (3-11-14) సాకారాన్ని చెప్పి పై వర్ణనలోని లోపాన్ని మరొకచోట సంపూర్ణము చేస్తున్నది.

'లోపమా'?

కాదా మరీ! నిర్వికల్పముతో బ్రహ్మ స్వరూపమును ఒకమారు తెలుసుకుంటే 'బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి'కదా! – కనుక ఆ యోగి బ్రహ్మయే అవాలి. అప్రయత్నంగా అలాగ అవడు. అందుకే శ్వేతాశ్వతరము "నిత్యమూ ఆత్మ సంస్థితుడై ఉండవలెను" అనీ, (1-1) శంకరులవారు "స్వానుభూతిం పరిత్యజ్య న తిష్ఠన్తి క్షణం బుధాః" అనీ

25. తద్దూరే తద్వదన్తికే, ఆసీనో దూరం వ్రజతి, దూరాత్సుదూరే తదిహాన్తికేచ స శ్యత్.

అన్నారు. కాని ఇంత మాత్రము తోతాపురివంటి కులపతికే చాలలేదు? లోకము పట్టిది అంటే లోకము పోలేదు. ఆచార్య శంకరులే మాలవాణ్ణి దూరంగా పొమ్మన్నారు! బ్రహ్మము మారదు అంటే చాలదు. మారుతూనే ఉంటుంది అనాలి. బ్రహ్మమూ శక్తీ ఒకటే. ఇంకా దగ్గరకు వెళ్ళి అమ్మ చెప్పి నట్టు "మారుతూ కూడా వుండే బ్రహ్మము తప్ప వేరేమీ లేదు" అనాలి. మారని బ్రహ్మనికి మారక పోడము లోపము. లోపాలు లేనిది ఈ రెండూ చేరి సంపూర్ణమైనట్టిదే గదా?

'ఎలాగా?'

బ్రహ్మనికి గుణాలు లేవన్నారు. సంకల్పాలు లేవ న్నారు. రూపము లేదన్నారు. పట్టింపు లేదన్నారు. ఈ లోపము అభావమే అయితే, ఇవన్నీగాని వీటిలో ఏవిగాని ఉన్నవారు బ్రహ్మముకంటే ఆ విషయములో వేరూ అధికు లూనే అనాలి కదా? ఆ అధిక్యము ఒప్పుకుంటారా?.... 'సమాధి అనుభవమును దొరకబుచ్చుకొని అది మాత్రమే బ్రహ్మ' అంటే వస్తుంది చిక్కు. అప్పటి ఏకత్వమే జాగ్ర దవస్థలోని వైవిధ్యము అయింది. అని ఛాందోగ్యములో (3-14-1) లాగ "సర్వం ఖల్విదం బ్రహ్మ" అంటే చిక్కే లేదు. అది తెలిసినవాడికి సర్వదా సమాధే. "నీవూ నేనే. మీరంతా నేనే. ఇదంతా నేనే". మరి మాలవాణ్ణి పొమ్మనక్కర

ఉండదూ, తోతాపురిలాగ అగ్నిహోత్రము ముట్టవద్దనే అవసరము ఉండదూ. ఉపనిషత్తుల్లో 'సహజ సమాధి' అనే మాట మాత్రమే లేదుగాని నిర్వికల్పాన్నీ జాగ్రదవస్థనీ దగ్గరకు చేర్చుకునే మననము ధారాళంగా వున్నది.

'అక్కడిదొక ముక్కా ఇక్కడిదొక ముక్కా చేర్చి చూపిస్తేనా?'

ఉపనిషత్తులు ఏవొకటీ - ఏ కేనోపనిషత్తో తప్ప - ముక్కూ, నడుమూ, తోకా వరసగా కుదిరి వున్నవి కావు. వాటిలోని వస్తువు ఐక్యత కుదిరేటట్టు పేర్చలేదు. అవి వేర్వేరు ఆశ్రమాలలో కూర్చబడిన ఆధ్యాత్మిక వస్తు జ్ఞాపికలు **(Spiritual notes)** లాగ కనిపిస్తాయి. మనము అర్థము సమన్వయమయేటట్లుగా కూర్చుకోవాలి. ఎవరేనా చేసిన దదే. సందర్భాన్ని తప్పించి వాక్యాల్ని, పలికించలేదే నేను?.... ఏకత్వద్యోతకాలు ఇంకా చెప్పుతా వినండి.

ఇందాకా లోపము అన్నానే అంటే నా వుద్దేశము 'ఒక పక్షాన్నే వర్ణించడము. సర్వానన శిరోగ్రీవుడుకి రూపము లేనిది కూడా చేరినప్పుడే లోపము నిండుకుంటుంది. అలాగే రూపములేని దానికి సర్వానన శిరోగ్రీవుడు చేరాలి. ముండక ములో "ముందు బ్రహ్మ వక్కన బ్రహ్మ, దక్షిణోత్తరాల బ్రహ్మ, కిందా పైనా బ్రహ్మే, ఈ వరిష్ఠం విశ్వమూ బ్రహ్మే

అని తెలుసుకో" అన్నారు[26] (2-2-12) కఠోపనిషత్తులో "ఇక్కడ ఏది ఉన్నదో అక్కడా అదే వున్నది. ఇక్కడ నానాత్వము చూచే వాడు మృత్యువునుంచి మృత్యువుకి పోతాడు" అన్నారు[27] (2-1-10) కనక నిర్వికల్ప ఏకత్వ దర్శకము చాలదు. 'ఇక్కడి నానాత్వమూ ఆ ఏకత్వానిదే. ఒకటే ఇన్నీ అయీ ఉన్నది' అనుకుంటేనే సర్వ సమానత్వము ఏర్పడగలదు. ....ఐతరేయము "అదే బ్రహ్మ అదే ఇంద్ర, అదే ప్రజాపతి, ఈ సర్వదేవతలు, పృథివి వాయుః వు ఆకాశము అప్ జ్యోతి బీజాలూ ఇతరాలూ అండ జాలూ స్వేదజాలూ ఉద్భిజ్జాలూ అశ్వాలూ ఆవులూ నడిచేవి ఎగిరేవి కదలనివి అన్నినీ" అంటుంది (3-3).

'ఇదిన్నీ సమాధి దర్శనానంతరము నిర్వికల్పాన్ని సహజము చేసుకునే సాధనే అంటారా?' కావచ్చును. కాని దీనికి మూలము కేనోపషత్తుకి లాగ విచారమేనో లేక సమాధో తెలి యదు. అయితే ఇది మహిదాసుకి భూదేవి చెప్పిన జ్ఞానము. సహజసమాధికి మననము చేసుకోవలసినది మాత్రమౌను.

---

26. బ్రహ్మైవేదమమృతం పురస్తాద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణత శ్చోత్తరే, అధశ్చోర్ధ్వంచ ప్రసృతంచ బ్రహ్మై వేదం విశ్వ మిదం వరిష్ఠమ్.
27. యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహమత్యో స్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి.

దీనికన్న గొప్ప ఉద్ఘాటన నారాయణోపనిషత్తులో వుంది. (ఆ సంగతి అమ్మ చెప్పేరు) "నారాయణుడు ప్రజను సృజింతు నని కోరెను. నారాయణునుండి ప్రాణమూ మనస్సూ సర్వేంద్రియాలూ పంచభూతాలూ, బ్రహ్మ, రుద్రుడూ, ద్వాదశాదిత్యులూ రుద్రులూ వసువులూ వేదాలూ పుట్టినవి. ౧ నారాయణుడు, నిత్యుడు. బ్రహ్మ నారాయణుడు, శివుడూ నారాయణుడు, ఇంద్రుడూ నారాయణుడే, కాలమూ దిక్కులూ విదిక్కులూ, పైనా కిందా లోపలా బయటా నారాయణుడే. నారాయణుడే ఈ సర్వమూను. ఇదివరకు ఉండినదీ, ఇక ముందు పుట్టేదీనూ, నిష్కళంకుడు, నిరంజనుడు, నిర్వి కల్పుడు, శుద్ధుడు, చెప్పబడనివాడూ దేవుడు నారాయణుడే ఒక్కడు. రెండోది ఏదీ లేదు. (౨") అంటుంది నారాయణో పనిషత్తు. ఇదీ పరమసత్యము. ఉన్నదంతా ఒకటే.

అయితే సమాధి అనుభవమును పొందిన వారందరూ ఇలాగ ఆ సర్వమూనే ఈ సర్వమూ అయి వచ్చినదని అనుకోలేక పోయారు. లోకములో జడపదార్థాలూ అజ్ఞానా వృతాలు జీవులూ ఉండడము చూచి కాబోలు, అది ఇవన్నీ ఎలాగౌతుందీ? అనుకుని' అది 'అంతా అయివున్నది' అన కుండా అది అన్నిటిలోనూ వున్నది' అన్నారు. కొందరు అదీ ఇదీ వేర్వేరు అన్నారు. ఐతరేయము చెపుతుంది: "ఆత్మ దేవతలను సృజించిన తరువాత పురుషుని సృజించి, దేవతలను వాని యంగములలో ప్రవేశించమని, చివ్వర తాను పురుషుని మూర్థమును భేదించి తానుకూడ ప్రవేశిం

చెను" అని. ఇది అంతర్యామిత్వములో నమ్మకమే. యజ్ఞాలలో మేక గుండెను కోసి దానిలో అంగుష్ఠ మాత్రపు అవకాశ ముండుటచూచి కాబోలు "అంగుష్ఠ మాత్రముగా పురుషుడు హృదయాలలో వుంటాడు" అన్నారూ, ఈ పురుషుణ్ణి ధ్యానముగా చేశారు. పైన పలికినవారంతా ఆత్మ సర్వరూపత్వాన్ని నమ్మితే వీరు ఆత్మయొక్క అంతర్యామిత్వాన్నే నమ్మేరు. ఉపనిషత్తులలో సర్వరూపత్వ సూచక వాక్యాలతోపాటు అంతర్యామిత్వ సూచకములైన వాక్యాలు కూడా పక్కపక్కల్ని కనిపిస్తాయి. కనుకనే 'పస్త్వైక్యము లేదు ఉపనిషత్తులలో' అన్నాను. అయినా ఉన్నంతలో ఆత్మ సర్వరూపత్వ సూచకవాక్యములు నిర్వికల్ప సమాధి తర్వాత మననము చేసుకోవలసినవీ, సహజసమాధికి దారి తీసేటట్టివని అన్నది నిజము.

'కనక?'

కనక నిర్వికల్ప సమాధిస్థితికాదు మన గమ్యము. సహజ సమాధియే. ఆ మాట ఉపనిషత్తులలో లేక పోవచ్చునుగాని ఆ స్థితి వర్ణన అతిచిన్న ఉపనిషత్తు ఈశా వాస్యములో ఆరూ ఏడూ మంత్రాలలో విశదంగా ఉన్నది. 'ఆ స్థితి ఎలాగ లభిస్తుందీ అని?'

# 'బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి'యా ?

"సర్వకాల సర్వావస్థలలోనూ సమాన స్థితియే సమాధి" అన్నారు అమ్మ. 'సమాధి' అనే మాటకు సహజ సమాధి అనే అమ్మ అర్థము. సహజ సమాధి ఎప్పుడూ వుండే సమాధి. ఇంద్రియాలను లాగిపట్టి మనస్సును ఏదో మంత్రమో రూపమో మీద కేంద్రీకరించి దాని అర్థమునే తననిండా నింపుకుంటే, కొంతసేపు శాంతి లభించవచ్చు. కాని ఆ తరవాత మళ్ళీ లోక వైవిధ్యాన్ని దర్శించడమూ, కనబడిన దానికి ఇష్టపడడమూ కష్టపడడమూ తప్పదు. యత్నపూర్వకంగా – ఏదైతేనేం – ఒక ప్రక్రియవల్ల వచ్చినశాంతి మళ్ళీ దిగిపోక తప్పదు. ఈ శాంతి ఎప్పుడూ ఉండగల స్థితే సహజ సమాధి. అది దేనివల్ల లభిస్తుందీ అని.

ఆచార్య శంకరులు వివేక చూడామణిలో "బ్రహ్మాత్మైకత్వ బోధవల్లనే మోక్షము సిద్ధించును. ఇంకొక దానివల్ల కాదు" అన్నారు[28] (58వ శ్లో). అజ్ఞాన హృదయ గ్రంథి నిర్దిష్టముగా ఎప్పుడు విడిపోవునో, అప్పుడు నిర్వికల్ప సమాధిలో అద్వైత దర్శనమ్ అన్నారు [29] (355 శ్లో). 'నేను', 'అనుభవిస్తున్నాను' అనే రెండు వికల్పాలూ అణిగిపోయి 'నిర్విశేష అద్వయ పరమాత్మ మాత్రమే స్ఫురించడము నిర్వికల్ప మ'న్నారు [30] (356). శరీరోపాధుల భేదము వల్ల వేరువేరుగా తోచే ఆత్మ (సమాధిలో) ఆ ఉపాధి విలయమువల్ల సర్వమూ తానే అయివుంటాడూ, (359). అలాగ నిర్వికల్ప నిష్ఠలోనే వుండాలిట విద్వాంసుడు. [31] అన్నారెడ్డిపాలెపు రామయోగిగారు 'నిర్వికల్ప సమాధిలో సాధకుడు ఏ రీతిగా ఉంటాడు స్వామీ' అని నేను అడిగితే, 'తానే అయి ఉంటాడు' అని చెప్పేరు. నిద్రలో తనను తెలియక ఉంటాడూ, ఈ సమాధిలో తన స్ఫురణే ఉంటూ ఉంటాడు. రెండు స్థితులలోనూ బహిశ్చేతనము బాగా అణిగిపోయివుంటుంది. "ఇలాగ నిరంతరాత్మధ్యానమువల్ల

---

28. బ్రహ్మాత్మైకత్వ బోధేన మోక్ష స్సిద్ధ్యతి నాన్యథా.

29. సమాధినా అవికల్పేన యదాద్వైతాత్మ దర్శనమ్.

30. ప్రవిలసతి సమాధావస్య సర్వో వికల్పో విలయన ముపగచ్ఛేత్ । త్వ మహమిద మితీయం కల్పనా బుద్ధి దోషాత్ప్రభవతి పరమాత్మ న్యద్వయే నిర్విశేషే.

సత్త్వరజస్తమో మలమును విడిచి సమతత్త్వము పొందు
తాడటా[31] (363), బాహ్యాభ్యంతరములయందు సర్వదా
యత్నము లేకనే స్వరూప విస్ఫూర్తి ఉంటుందట[32] (365).
ఇది ఎలాగా? ఇంద్రియ వ్యాపారాలను నిరోధించి బాహ్య
స్ఫురణను చాలామట్టుకు పోగొట్టి సమాధిలో 'తానే అయి
ఉన్నాడు. అందునుండి మామూలు స్థితికి వచ్చినప్పుడు
అన్నీ కనిపిస్తాయా వినిపిస్తాయి. వీటన్నిటిలో ఆత్మే ఎలా
స్ఫురిస్తుందీ అన్నివేళలా? 'అలాగ స్ఫురించేవరకూ ఆత్మ
నిష్ఠలోనే ఉండాలి' అని కాబోలు ఆచార్యులవారి ఉద్దేశము.
నిరంతరమూ స్ఫురించేటట్టయితే మంచిమాటే. ఈ ఆత్మ
నిష్ఠనుగురించి వారు ఇంకా చెప్పినది చూతాము. యోగికి-
అనగా నిర్వికల్ప నిష్ఠతో తానే అయివుండగల సాధకునికి-

---

31. ఉపాధి భేదా త్స్వయమేవ భిద్యతే । చోపాదధ్యపోహే
స్వయమేవ కేవలః । తస్మా దుపాధేర్విలయాయ విద్వా
న్వసే త్సదా కల్ప సమాధి నిష్ఠయా.

31. తథా మన స్సత్త్వ రజస్తమో మలం
ధ్యానేన సంత్యజ్య సమేతి తత్త్వమ్.

32. సమాధినా అనేన సమస్త వాసనా
గ్రన్థే ర్వినాశో అఖిల కర్మనాశః
అన్తర్బహి స్సర్వత ఏవసర్వదా
స్వరూప విస్ఫూర్తి రయత్నతస్స్యాత్.

"సంతతమూ చిత్తనిరోధ యత్నమే కర్తవ్యము"[33] అన్నారు. 370లో. ఏమీ అంటే, "బయటి విషయ సంగమూ, లోపలి అహంకారమూ యత్నము వల్లనే విడిచి" (375) గదా బ్రహ్మనిష్ఠుడవ గలిగేడు? సమాధినుండి లోకస్ఫురణకు రాగానే అవి రెండూ మళ్ళీ ఇటూ అటూ తయారు! కనుకనే కాబోలు "(బయటి) ఘటపటాదులనువలెనే 'నేను' అనే అహంకారమునున్నూ విడిచి ఉదాసీనతతో చూడమన్నారు[34] (384లో) కాబట్టి సమాధినిష్ఠ మాత్రమే చేసేయోగికి, సమాధిలో ఆత్మ స్ఫురించవచ్చునుగాని సమాధికి బయట అయత్నముగా ఆత్మ స్ఫురించదు. లోపల చూసినప్పుడు వలెనే, బయటకూడా ఆత్మే స్ఫురించాలంటే యత్నము అవసరమే. (సమాధినిష్ఠమట్టుకే చాలదు). ఆ యత్నము ఎలాటిదీ అని?

ఒకమారు సమాధి అనుభవమును పొందిన వారు జాగ్రదవస్థలో ఏమని అనుకోవచ్చు? అన్నది చూద్దాం. "ఈ విశ్వమంతా వట్టిదీ, తుచ్ఛమూ; యోగసమాధిలో కనిపించే

---

33. తస్మాత్ చిత్తనిరోధ ఏవ సతతం కార్యః ప్రయత్నాన్మునేః

34. అహమాదిషు సంత్యజన్, ఉదాసీనతయా తేషు తిష్ఠేత్ ఘటపటాదివత్.

'ఏకమ్ శుక్రమకాయమవ్రణమ్' అయిన ఆత్మే సత్యము" అనుకోవచ్చు. "ఇంత విశ్వమూ ఇంత వైవిధ్యమూ ఆ అనంత తేజస్సులో అయిపే లేదుగా! ఇంద్రియాల్ని అదిమి చక్షువులను వెనక్కి త్రిప్పి ప్రత్యగాత్మను చూస్తే గోచరించిన తేజస్సూ ఐక్యతా అదే సత్యమనుకోవచ్చు. "పంచభూతాత్మక మైన ఈ విశ్వము ఎండమావుల నీరువంటిది. వాస్తవంగా లేనిది. (అవధూత గీత: 3) నేనే ఈ సర్వమూ ఆకాశాతీత (ఆత్మ) స్వరూపుడను (10) నీవూ నేనూ జగత్తూ అన్నవి లేవు. అంతా కేవలము ఆత్మే (15). పాంచభౌతికమైన జగత్తు అనృతం (25). సాకారము అనృతమే అని తెలుసుకో. అనంత రూపాలుగా వున్న వస్తువులు ఏమీ లేనివే (29). వేదాలూ లేవూ, లోకాలూ లేవు. దేవతలూ యజ్ఞాలూ వర్ణాశ్రమాలూ కులాలూ జాతులూ లేవు. ధూమ మార్గమూ లేదూ దీప్తిమార్గమూ లేదూ, అంతా బ్రహ్మైకరూపమే (24)" అనుకోవచ్చు. ఒకమారు సమాధి పొందినవారూ అంటే, అది పొంది అద్భుతపడి మళ్ళీ మళ్ళీ దానినే పొంద నెంచేవారు అందాము. అవధూతగీతేకాదు అష్టావక్రగీతా పై ధోరణిలోనే, "నీవు విప్రుడవు కావు కర్తవు కావు భోక్తవు కావు" అంటుందీ "భ్రాంతిమాత్ర మిదం విశ్వం" అంటుందీ "సర్వవిస్మరణానికి మించిన స్వాస్థ్యము లే"దంటుంది. నిర్వాణషట్కం "నచవ్యోమ భూమిర్నతేజో నవాయుః, నచప్రాణసంజ్ఞో నవై పంచవాయుః నవాసప్తధాతు ర్నవా పంచకోశః, నవాక్పాణి పాదం నచోపస్థ పాయుః, నపుణ్యం నపాపం

నసౌఖ్యం నదుఃఖం, నమంత్రో నతీర్థ నవేదా నయజ్ఞః అహం భోజనం నైవభోజ్యం నభోక్తా, చిదానందరూపః శివోహం శివోహం" అంటుంది. ఇలాగ అనుకుంటూన్నవారికి మన స్వాస్థ్యం, లేదా శాంతి, శరీరముండగా వస్తుందా అని? 'నేను అదికాదు' అంటున్నారూ 'నేను ఇదీ' అంటున్నారు! 'సాకారము అనృతమూ, నిరాకారమే నిరంతరమ్' అంటు న్నారు (అవధూతగీత 21; అష్టా వక్రగీత 1-16.). రెండు వ్యతిరేకాలు చూస్తున్నప్పుడు సమత్వమెక్కడిది? సమత్వం లేకుంటే శాంతి ఎక్కడిది?

ఆచార్య శంకరులు ఈ దశలో పనికివచ్చే రెండు విధాల మననములు కర్తవ్యములుగా సూచించారు. ఒక మననము దృశ్యానువిద్ధమూ ఇంకొకటి శబ్దానువిద్ధమూను. జాగ్రదవస్థలో మన ఇంద్రియాలు గుర్తించి కాంక్షించేవన్నీ ఇంద్రియాలకు దృశ్యాలేగదా? వాటిని గురించి శంకరులు సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహములో చెప్తారూ: "కోరే ఈ దృశ్యాలన్నిటికీ నేను సాక్షినీ అని వాటి నన్నిటినీ తనలో విలాపము చేసుకోవాలీ, నేను దేహము కాను, ప్రాణము కాను, ఇంద్రియవర్గము కానూ, అహంకారము కానూ, మనస్సు కానూ, బుద్ధిని కానూ నేను వీటికి సాక్షినీ, ఇవి దృశ్యాలూ, నేను వీటిని చూచే సాక్షినీ చైతన్య రూపుడనూ" (825-832) అని దృశ్యములను తనలో లయము చేసుకో వాలీ అన్నారు. ఇక్కడ దృశ్యాల్ని తనకంటే వేరని గుర్తించడము ఒకపని. "నేనే సత్తనూ, నేను వాటిని

గుర్తించి వాటికి సంబంధించిన మనోవృత్తుల్ని కల్పించు కుంటేనే అవి నాకు ఉన్నాయి లేకుంటే అవి లేవూ, ఉన్నది నేనే, నేను వినా అవి లేవూ, కనక అవన్నీ నాలోవే" అను కోడము - విలాపము - రెండో పని. తరవాత "నేను శుద్ధుడను, బుద్ధుడను, శాంతుడను, అనంతుడను, అద్వితీయుడను, పరంజ్యోతిని" అని నిజతత్త్వ బోధకములైన శబ్దాలు మననము చేస్తూ స్వస్వరూపముతోనే ఉండడము మూడో పని. ఈ పనులు చేసుకోడములోని కష్టనిష్ఠురాలు కొంచెము పరిశీలించుకుందాము. ఇవన్నీ చేసుకున్న తర్వాత సంగతులు తరవాత ఆలోచిద్దాము.

ఎవరికేనా ఇంద్రియాలకు గోచరించేది విషయావృతమైన ప్రపంచము. ఈ గోచరముతోనే వాటిమీది రాగద్వేషాలు తలెత్తుతాయి. విషయాలను రాగద్వేషాలకు వేరు చేసి వాటిమీద నిరసన పెంచాలని శంకరులు 21, 74, 89 శ్లోకాలలో చెప్తారు. ఇది వైరాగ్యము. విషయాలను చూడగానే లేచే కోరికల్ని వెనక్కి లాగడము అన్నది కోరిక పుట్టుతున్నది అనే స్ఫురణ వున్నప్పుడు సులువు కావచ్చును కాని ఆ స్ఫురణే కష్టము. చిరకాలము తపస్సు చేసిన జడభరతుడు జింకపిల్ల మీది జాలివల్ల దిగజారిపోయాడూ. దుర్వాసుడు అహంకార కోపముతో పడుతూ లేస్తూ సాగేడు. మాందకర్ణికి కామచాపల్యము కారణమైంది పతనానికి. విశ్వామిత్రుడు లాంటి అర్థార్థులే తమ లక్ష్యాన్ని విస్మరించారు అచ్చరలను చూచి. కోరిక పుట్టిస్తుందిగాని వస్తున్నానని చెప్పదు! ఇక

వైరాగ్యము పెంచుకోడానికి శరీరము హేయమని తర్కించి విషయసుఖాల్ని ఏవగించుకోడము శరీరాన్ని కోసి చూసే డాక్టర్లకే స్వభావము కావడము లేదు, కేవల తర్కమువల్ల ఎంతమాత్రము కాగలదు! పోనీండి. ఒకయోగి ఈ పద్ధతిలో వైరాగ్యము పెంచుకొని రెండోపని 'దృశ్యవిలయము' చేసు కుంటూ సాగుతున్నా డనుకుందాము. ఆయన అనుభవములో చాలా చాలా దృశ్యాలు విలయమైనా, తోతాపురికి అగ్ని హోత్రమూ, జడభరతుడికి జింకపిల్లా, అగస్త్యుడికి పితరుల మీది మమకారమూలాగ ఏదో ఒక చేరువ వస్తువుమీద బంధము మిగల వచ్చునూ. అది ఆయనకు సర్వదృశ్య విలయము అందకుండా పైవారిని అడ్డినట్లే అడ్డుతూండ వచ్చును. అడ్డదే అనండి. నిజతత్త్వ బోధకములైన శబ్దాలు మననము చేస్తూ సర్వదా ఆ యోగి 'నేను సర్వమూ అయిన ఆత్మను' అనే స్ఫురణతో లోకస్ఫురణ ఏమిన్నీ లేకుండా అవధూత స్థితిలో ఉంటాడు. నగరాలు వదలి వెళ్ళినవాడూ, నేను గాలి కాదూ, నీరు కాదూ, పొడుగూ కాదూ, పొట్టీ కాదూ' అనుకున్న వాడూ కదా ఈయన? మనతో ఈయ నకు ఏ ప్రసక్తి లేదు. ఏ గిరి గహ్వరాలలోనో వుంటా డీయన. గీతలో చెప్పినట్లు 'గుణా గుణేషు వర్తంతే' అనుకొని ఈయన 'న సజ్జతే': దేనికీ ఉద్యమించడు. ఈయన దెంత సేపూ కేవల నిర్వికల్పము ఈయన మనకి లోకములో లేని వాడుగానే జమ.

పరమహంస చెప్పినట్లు ఈయన గోడమీద కూర్చొని అందమైన తోట చూశాడూ, దానిలోనికి ఉరికేశాడు. ఆయన స్థితి ఏమిటో మనకు తెలియరాదు. అంతేకదా? శరీరపతనమై ఏ గుహలోనో వెళ్ళిపోతాడూ, లేదా సాధనలో పతనమై లోకములోకో వస్తాడు. వెళ్ళిపోతే ఆయన స్థితిని గురించి మంచీ చెడ్డా ఏమిన్నీ మనకు తెలియరాదు. రమణమహర్షి వలె మనలోకి వచ్చి మనతో సాయిలా పాయిలా మాటలతో పాటు పరమార్థ దర్శనమూ చేయించితేనే మనకేమైనా తెలుస్తుంది. లేకుంటే మనకు లేనివాడే. ఏదో తెలియని గమ్యాన్ని చేరినవాళ్ళను ఏ ధైర్యంతో అనుసరించగలమూ? వారు లోకాన్ని తన్నేసి పోయారు, వారికేమి వచ్చినదో తెలియనిదీ మనమూ లోకాన్ని ఎలాగ తన్నేసి పోగలమూ!

లోకములో మనతోపాటు ఉంటూనే సాధన చేసేవాడికి పనికివచ్చేటట్టు కాబోలు ఆచార్య శంకరులు "దృశ్య ప్రపంచమును ఉదాసీనతతో చూడు" మంటూ ఇంకొక ప్రక్రియ చెప్పేరు, దానిని చూద్దాము వివర్తవాదము దానికి ఆధారము. "మహత్తునుండి దేహము వరకూ అంతా అనిత్యము. ఇది ఎండమావిలో నీరు లాంటిది (వివేక చూ. 125). ఇదంతా మన అజ్ఞానం వల్ల వైవిధ్య విశిష్టమైన ప్రపంచముగా కనిపిస్తున్నది కాని వాస్తవానికి ఇది బ్రహ్మమే (230) మన భ్రాంతివల్ల తాడు పామువలెనూ, ముత్యపు చిప్పలో వెండి ఉన్నట్టూ కనిపిస్తున్నదిగాని నిజంగా వెండి లేదుగా? నిద్రలో చూసిన స్వప్నంలాగ ఇదంతా వాస్తవానికి లేనిదే.

భ్రాంతివల్ల బ్రహ్మమే జగత్తుగా కనిపిస్తుంది అన్నారు శంకరులు. ఈ భావాలు బాగా ఆకళించుకొని బాహ్య ప్రపంచాన్ని నిరోధించు మంటారు. (333 336, 337 లలో.) అయితే అమ్మ అన్నట్లు మనకు తాడూ పామూ అన్నవి రెండూ తెలిస్తే కాని భ్రాంతి ఉండదు. తాడు మాత్రమే ఉండి అదే మనకు తెలిస్తే చీకటిలో కనపడ్డది తాడే అనుకుంటాము, పాము మాత్రమే ఉండి అదే తెలిస్తే వంకర టింకరలది పామే అనుకుంటాము. తాడన్నదీ పామన్నదీ రెండూ ఉండి రెండూ మనకు తెలిసినప్పుడే దానిని చూచి ఇదనీ, దీనిని చూచి అదనీ అనుకోవడము జరగగలదు. ఈ రకపు ఉదాహరణ లన్నిటిలోనూ రెండూ ఉన్నవీ మనకు తెలిసినవీనే అయి ఉన్నవి. పాము (అనే జగత్తు) లేనే లేక పోతే తాడు (అని వారనే బ్రహ్మము) పాములాగా ఎలాగ కనబడగలదూ? 'తాడూ పామూ అని రెండు నీకు తెలిసినవి ఉన్నాయి అని అనకుండా 'నీకు పాములాగ కనబడుతున్న టిది సమాధిస్థితిలో కనబడే తాడే' అంటున్నారు. 'ఆ తాడు కదలనే కదలదూ, కదిలే ఈ పాము వాస్తవానికి కదలని ఆ తాడే అంటున్నారు కదలక పోడమే గొప్పటా, కదలడము జబ్బుట. కనక జగత్తుయొక్క ఈ కదలడము ఆ కదలని దాని వేషమే కాని నిజము కాదట. సమాధిలో కదలనిది తెలిసిందీ, జాగ్రత్తలో కదిలేది కనిపిస్తున్నది. కదలనిదే నిజము, కదిలేది అబద్ధమూ అనడమేమీ? 'ఉన్నదేదైనా దానికి జాగ్రదవస్థలో గోచరించే రీతిగా కదలడమూ సమాధిలో

లాగ కదలక పోడమూ నిజమే' అనవచ్చుగదా? రెండూ ఉంటేనేకదా నిండూ? అదో ఇదో మాత్రమే అయితే నిండు ఎలాగా?

విశ్వములో అంతా నేనే అయిన శక్తి అరూపమూ సరూపముగా కూడా ఉన్నది. సరూపి మారుతుందన్నంత మాత్రాన హుళక్కి ఏమీకాదూ మారని అరూపే ఎప్పుడూ మారకుండానే ఉండేది అనీ లేదు. అది మారకనేపోతే మారేది ఎలా వచ్చింది? మారని శక్తి మారే శక్తి ఎన్నెన్ని రకాలుగానో ఆకాశమూ నీరూ రాయీ రప్పా నుంచి ఏనుగూ తిమింగలమూ మానవుడూగా భూమి మీద కలిసివుండే కనిపిస్తున్నాయి. సమాధిస్థితిలో అరూపి చైతన్యము అంతా తానే అయినట్టుగా కనిపించేలాగనే, జాగ్రత్ స్థితిలో సరూపి ప్రపంచమే అంతా అయినట్టు కనిపిస్తుంది. నిజము అది వొక్కటీ కాదూ ఇది వక్కటీ కాదూ, రెండూ చేరి నిండైనదే నిజము. తాడే కాదు ఉన్నది, పామూ ఉన్నట్టిదే. తాడూ పామూ తానే అయి, సర్వమూ అయినది నిజము. రూపము గల అన్నము ప్రాణులలో చేరి రూపభేదము పొందినప్పుడు సరూపి అయిన అన్నవస్తువు అరూపి చైతన్యముగానూ శక్తిగానూ మారుతూన్నది. ప్రాణి ఏది అయినా పని చేసింది అంటే, అరూపి చైతన్యము శక్తిగా, (అంటే దానికి సమానమైన వస్తువుగా,) మారిన దన్నమాటే, కాగా 'చైతన్యమే నిత్యమూ వుండేటిదీ మారుతూవుండే వస్తువు మిథ్య' అనడము ఎలాగ? శంకరులు కానీ గౌడపాదులుకానీ,

ప్రపంచము మన మనస్సులో తప్ప వాస్తవంగా లేదూ, కనక, ప్రతి దృశ్యాన్నీ నీలో విలయము (విలాపము) చేసేసుకో అన్నారూ అంటే, "'నేను' అని అనుకుంటున్నదే నిత్యమూ మారనిదీనీ దానినే వెంటబెట్టు" అన్నారన్నమాట. ఇది ఫక్తు ఆత్మాశ్రయమైన ఆలోచన. 35 దీనికి గమ్యము లోకానికి వెల్లడైన అవధూత స్థితి. వారికి లభ్యమైన దేమిటో ఎవరికీ తెలియదు. ఇది కైవల్యమా? ఈ స్థితిలో ప్రపంచము లేనిదే అవుతుందా? తనలోని ప్రత్యగాత్మనే ధ్యానించే యోగి ఆ సమాధి దశలో ఉన్నప్పుడు ఆయనగారి మనస్సు లోపించిపోతుందా అని వైజ్ఞానికంగా సోదా చూసి నప్పుడు నూరులో పదిపాళ్ళు మానసిక స్పందనాలు

---

35. ఇదే అందరికీ ఇష్టమూ అనుకూలమూ అయినదారి కాదు గదా? ఉపనిషత్కాలములో ఏమయినా ఆ తరవాత భక్తీ, విచారమూ ఆలంబనాలైనాయికదా? కేనోపనిషత్తులో విచారమూ, శ్వేతాశ్వతరములో భక్తీ ప్రకాశిస్తునే ఉన్నాయి. అందరికీ నిర్వికల్ప సమాధే మోక్ష ద్వారమా? కాదే? మరి గమ్యమేమిటీ అందరికీ? తనలోని ప్రత్యగాత్మను అంతర్దృష్టితో కాక, సర్వాంతర్యామి పరమాత్మను సృష్టిలో ప్రయోజనమునుగా, సౌందర్యముగా గుణమునుగా శక్తినిగా చూచే వారికి గమ్యమేమిటీ?'

ఉంటూనే ఉన్నాయట. ఇవి భౌతిక సాధనము ఉపయోగించినందువల్ల కాకపోయినట్టయితే బిగబట్టిన ఆ పరమ స్థితిలోకూడా మనస్సూ ఇంద్రియాలూ పనిచేస్తూనే ఉన్నాయన్నమాటే. ఈయన బ్రహ్మమే అయినాడని మనము నమ్మవలసినదే కాని మనకు నిరూపణ ఏదీ లేదు. ఇంత తర్జన భర్జన ఎందుకూ అంటే, సర్వములో చైతన్యమనే అరూప విశేషాన్ని వెంటబెట్టి అదే సర్వమూ అనేసి, బయటి సరూప జగత్తున 'స్వప్నము వలె మృష' అని హుళిక్కి చేస్తున్నారు కనక. సగమైన జగత్తుని విస్మరించేసి ఆత్మ అనే సగాన్నే ప్రత్యేకించి శోధించినప్పుడు పూర్ణమయినదాని సంగతి ఎలాగ తెలుస్తుందీ అని! లోకమంతా హేయము అని వైరాగ్యము బోధించినా, 'నీవు వినా నీకు లోకము అన్నది లేదు కనక లోకమంతా నీలోదే నీ కంటె వేరు కాదు' అని విలాపము చేసుకోమన్నా, 'నేను శుద్ధ బుద్ధ శాంతి స్వరూపుడను' అని శబ్దముల సాయముతో స్వస్వరూపాను సంధానము చేసుకోమన్నా, అనంత వైవిధ్యముతో కన్ను తెరచినప్పటినుంచీ కనబడుతున్న విశ్వము అరూపములో లీనమైపోదూ, లోపించీపోదు. అవధూత స్థితిలో ఉన్న వారుకూడా మాతృస్పర్శవల్ల జాగ్రత్ స్థితికి వస్తున్నారు! ఇంద్రియాలను లాగిపట్టి ఏకత్వానుభవముతో ఆనందించిన వారు ఎన్నాళ్ళు ఆ సాధన చేసినా భ్రమరకీట న్యాయ సహాయమువల్ల 'బ్రహ్మైవ భవతి'కారు. కీటకము భ్రమరము అవదు! అది పరిశీలనా లోపమువల్ల పట్టిన అపోహ.

కేవల బ్రహ్మవిదులు బ్రహ్మ కాలేదు. వివరిస్తాను చిత్తగించండి.

ముండకోపనిషత్తు 2-1-1లో "సుదీప్తమైన అగ్ని నుండి సరూపములైన స్ఫులింగాలు వేలకొద్దీ పుట్టుతున్నట్లే అక్షరము నుండి వివిధ పదార్థాలు పుట్టుతున్నవీ అందే లయిస్తున్నవి" అని అక్షరమును సర్వముగా చెప్పి 2-1-4లో "అతడు సర్వ భూతాంతరాత్మ" అంటున్నది. అతనినుండే పుట్టినవాటి కతను అంతరాత్మేమిటి? మళ్ళీ ఈ రెండు మాటలే 2-1-10 లోనూ 2-1-6 లోనూను! ఆ ఋషి బ్రహ్మ సర్వ రూపత్వమును నమ్మినట్టా? అంతర్యామిత్వాన్ని నమ్మినట్టా? కఠోపనిషత్తు 2-2-11లో "సర్వభూతాంతరాత్మ" అంటుందీ మళ్ళీ 2-1-10లో "ఇహములో ఏది ఉన్నదో అముత్రములో అదే వున్నది. ఇక్కడ నానాత్వము చూచేవాడు మృత్యువు నుంచి మృత్యువు పొందుతున్నాడు" అంటుంది. కఠమహర్షి ఆత్మయొక్క అంతర్యామిత్వాన్ని నమ్మినట్టా, సర్వరూపత్వాన్ని నమ్మి నట్లా? ఐతరేయుఁడు మూడో అధ్యాయములో ఆత్మ సర్వరూపత్వము చెపుతూ, మళ్ళీ "ఆ ప్రజ్ఞానాత్మ ఈ లోకముదాటి స్వర్గలోకమందు సర్వ కామములూ పొంది అమృత సముడౌతాడు" అంటాడు ఆఖరి శ్లోకములో. ఇంకా సర్వ కామాలూ ఏమిటి? సర్వసమత్వము ఏమైందీ? "ధ్యాన యోగానుగతుడై తపఃప్రభావము వల్లా దేవ ప్రసాదమువల్లా

దేవాత్మశక్తిని చూచి"న శ్వేతాశ్వతరుడు, 'నిత్యమూ ఆత్మ సంస్థితుడై ఉండవలెనని మొదటి అధ్యాయములో చెప్పి శ్వేతాశ్వతరుడు రెండో అధ్యాయములో బ్రహ్మలోకానికి దారి చేసే సవితృప్రార్థన లను గురించి చెప్తాడు! 'సర్వానన శిరోగ్రీవుడై'న భగవాన్ మళ్ళీ 'సర్వభూత హృదయా శయుడు' అంటాడు సర్వ రూపత్వము ఉన్నదానికి మళ్ళీ సర్వాంతర్యామిత్వ మేమిటీ? ఈ యన దేనిని నమ్మినట్టూ? కేనోపనిషత్తు బ్రహ్మ చెప్పిన ఉపనిషత్తు చెప్పేనంటూ 'ఇది తెలుసుకున్నవాడు అంతము లేనిదీ శ్రేష్ఠమైనదీ అయిన స్వర్గలోకమునందు స్థితిగల వాడగును (4-9) అంటుంది. ఇంకా స్వర్గమేమిటీ? అనన్తమైన స్వర్గమట! అంటే అది సత్యలోకమూ కాదు, ఇంకొకటా? ఏది తెలుసుకుంటే ఇక తెలుసుకోవలసినదంటూ ఉండదో, ఆ బ్రహ్మవిద్య నేర్చి తన కుమారుడికీ చెప్పే ఉద్దాలకుడు, ఎవరికేనా కొత్త విద్య తెలుసునంటే నేర్చుకోడానికి వెళ్తాడూ, తన దగ్గరకు నేర్చుకోడానికి ఎవరేనా వస్తే వారికి చెప్పడము ఇష్టములేక వారినీ తీసుకుని ఇంకొకరి దగ్గరకు వెళ్ళుతాడు! ఈ ఫౌజు ఫౌజంతా బ్రహ్మగా అవని వారే, బ్రహ్మవిదులు మాత్రము అందరూ ఔదురు! మరి బ్రహ్మవిత్ బ్రహ్మైవ కేన భవతి?

లేదు బ్రహ్మవిదులు అంత మాత్రంతో బ్రహ్మ కారు. వారికీ బ్రహ్మత్వానికీ నడుమను, లోకాన్నికూడా 'ఇది కాదు

ఇది కాదు' అని తిరస్కరించిన దానికి విరుగుడు, 'ఇదిన్నీ అదిన్నీ అన్నీని' అనే మననము ఉన్నది. బ్రహ్మవిదుడు కాగానే ఆయనగారి అహంకారము పోదు పరమ భక్తునికివలెనే. ఇద్దరి ఆధ్యాత్మిక ప్రయాణమూ ఇంకా మిగిలే వుంది. ఎవరన్నారంటారా? రామకృష్ణపరమహంసా, రమణమహర్షినీ.

వివరిస్తాను చిత్తగించండి.

# జ్ఞానిలోనూ భక్తునిలోనూ అహం

రామకృష్ణ పరమహంస చెప్పేరు: "జ్ఞాని ప్రాపంచిక వస్తువులతో తన తాదాత్మ్యమును "నే నిదికాదు. ఇదికాదు" అనీ విచారించి విసర్జిస్తాడు. ఆ రీతిగానే అతడు బ్రహ్మమును తెలుసుకుంటాడు. అది మెట్లన్నిటినీ ఒకటి తర్వాత ఒకటి అతిక్రమించి డాబామీదికి ఎక్కడము లాటిది. కాని విజ్ఞానికి బ్రహ్మముతో ఇంకా సన్నిహిత సంబంధము ఉంటుందీ అతడు ఇంకా విశేషము తెలుసుకుంటాడు. అతడు మెట్లు కూడా డాబాచేసిన వస్తువులతోనే చేయబడ్డాయని తెలుసుకుంటాడు. అసాధారణ స్ఫురణతో, ఇదికాదు, ఇది కాదని అతడు గ్రహించిన బ్రహ్మమే ఈ విశ్వమూ విశ్వములోని ప్రాణులూ అయిందని అతనికి తెలుస్తుంది. విజ్ఞాని నిర్గుణమైన సత్యము సగుణమైన విశ్వమేనని తెలుసుకుంటాడు" అన్నారు (gospel : p 30). "డాబామీదనే

(అంటే సమాధిస్థితిలోదే) ఎవడూ చాలాకాలము ఉండలేడు. మళ్ళీ దిగి వచ్చేస్తాడు. సమాధిలో బ్రహ్మమును తెలుసుకొన్న వారుకూడా దిగివచ్చి, బ్రహ్మమే విశ్వమూ ప్రాణులుగా అయిందని తెలుసుకుంటారు. రాగము యొక్క మూర్ఛనలో సరిగమపధని లున్నాయి. కాని ఏ గాయకుడూ తన కంఠ మును 'ని' దగ్గర చాలాకాలము ఉంచలేడు. అహం పూర్తిగా పోదు (జ్ఞానికి) - (30) సమాధినుంచి దిగివచ్చిన యోగి బ్రహ్మమే అహమూ విశ్వమూ ప్రాణులన్నినూ అయినదని తెలుసు కుంటాడు. అదే విజ్ఞానమంటే (30) - బ్రహ్మమే సర్వమూ అయింది కనక విజ్ఞానికి ఈ ప్రపంచము 'ఆనంద నిలయము.' కాని జ్ఞానికి ఇదంతా 'మరుమరీచిక' (433).... విశ్వమూ, ప్రాణులూ చతుర్వింశతి తత్త్వములూ అయినది ఆయనే. ఆయన అక్రియుడైనప్పుడు ఆయనను 'బ్రహ్మ' మంటాను. సృష్టి స్థితి లయాలు చేసినప్పుడు 'శక్తి' అంటాను. బ్రహ్మమూ శక్తీ పరస్పరము వేర్వేరుకాదు. నీరు కదులుతున్నా నిశ్చలముగా ఉన్నా నీరే' అన్నారు పరమహంస. చాలా హాయిగా చెప్పేరు పరమహంస. సమాధిదశ జీవితంలో హెచ్చుస్థాయిదశ. అవసరానికి వీణ తీగను బిగించినట్లు. గాయకుడు ఎప్పుడూ 'ని' స్థాయిలోనే గొంతు నిలవలేడు అనడము చాలా విశదముగా ఉన్నది. యోగి సర్వదా యోగసమాహిత చిత్తముతోనే సమాధి దశ లోనే ఉండడము జరిగేపనికాదూ, కనకనే ఎవరికీ జరిగినపనీ కాదు. జ్ఞానము విజ్ఞానముగానే నిండాలి కనక సమాధి

అనుభవము మాత్రమే గమ్యస్థానము కాదు. అది సహజము కావాలి.

రమణమహర్షికూడా ఈ ధోరణిలోనే మాట్లాడుతారు వినండి: "అభ్యాసి 'నిత్యమూ ఉన్నట్టిదే సత్యము' అనే నిర్వచనముతో బయల్దేరతాడు. ప్రపంచము మారుతూన్నది కనక ప్రపంచాన్ని మినహాయించేస్తాడు. 'అది సత్యము కాజాలదు ఇదికాదు ఇదికాదు' అని ఇలాగ విచారముచేసి జిజ్ఞాసువు ఆత్మను చేరి అక్కడ ఏకత్వమే ఉండడము చూస్తాడు. అప్పుడు అనిత్యమని విసర్జించిన దంతా ఆ ఏకత్వభాగమే అని తెలుస్తుంది." ఇక్కడ మహర్షి "తెలుస్తుంది" అని వదిలేశారు. కాని సమాధి దశ పొందిన వారికి అందరికీ అది తెలియలేదు. మహర్షికి తెలిసింది. ఎలాగ తెలిసిందీ?

మహర్షి అందరు జ్ఞానులవలెనే ఈ విశ్వములోని విశేషమును 'నే నెవరు?' అనే ప్రశ్నను వెంటబెట్టి తెలుసుకున్నారు. అలాగ తెలుసుకున్నవారు మళ్ళీ మళ్ళీ సమాధి స్థితిని పొందడానికి యత్నిస్తారు. వారికి ఈ ప్రపంచమంతా (సమాధి సంతుష్టిలేని) 'మరుమరీచిక'యే. 'విశ్వము అద్దమునందు ప్రతిఫలించిన పట్టణమువలె అంతరంగముమీద కనబడుతుంది మళ్ళీ బయటనున్న దానివలె తోచుతుంది!' అన్నారు శంకరులు. 'పంచభూతాత్మకమైన విశ్వము మరీచి జలసన్నిభమ్' అన్నారు దత్తాత్రేయుం

వారు. రమణమహర్షి శరీరాన్ని చెదలుతిన్నా, లెక్కలేని ఈ స్థితినుంచి' - తన్ను చూడవచ్చిన వితంతువును 'నువ్వెటీ' అని పోల్చి "చిన్నప్పుడు వాళ్ళమ్మ 'గోచీకట్టుకుని వాళ్ళమ్మకి వంటసాయముచేసే ఆ కుర్రాడికి (నాకు) ఈ పిల్లనిస్తానా' అనేది. నాకైతే కల్యాణ యోగము లేక పోయింది గాని, నేనే ఈమెను పెళ్ళాడియుంటే ఈ పాటికి చచ్చిపోయివుందును" అనే - సదానందస్థితికి వచ్చారు. వద్దని తాను చెప్పినా, ఆశ్రమాధికారి నొవ్వనాడేదని ప్రయాణమైనస్వామి గుర్రపుబండిని స్వామికీ బండివాడికీ గుర్తులేకుండా చేసి అరుణగిరి ప్రదక్షిణము చేయించి ఆశ్రమానికి తెప్పించారు ఒకమారు. తనకు అనవసరమనిపించినా, భక్తులు భయపడి కళ్ళనీళ్ళు పెట్టుకుని బతిమాలితే ఏ మందేనా తాగేవారు. భక్తులతో గిరి ప్రదక్షిణానికి వెళ్ళే వారు. ఎవరేనా తనతో రావద్దన్నప్పుడు వెంటబడి ఏ బండ మీదనో కూర్చుంటే వారికి ఎండ అని బాధపడేవారు. చెట్టు ఆకులు రాల్చినా కొమ్మలు విరిచినా, కుక్కల్ని కొట్ట బోయినా కోప్పడేవారు. కోతి మనుషుల్ని ఏమార్చి పండు ఎత్తుకుపోతే చప్పట్లు కొట్టి నవ్వేవారు. వైష్ణవభక్తుడు ఒకాయన 'సామి నామాలు పెట్టుకుంటే చూడాలని వుంది' అంటే పెట్టుకున్నారూ గణపతిశాస్త్రిగారినీ ఏమార్చి స్వయంగా పెట్టుకునేట్టు చేశారు. అందరూ నవ్వుకున్నారు. లోకము మరు

మరీచికాస్థితినుంచి రమణస్వామికి ఆనందనిలయముగా దేని వల్ల మారిందీ? ఆయన మనుష్యుల్ని దూరము చెయ్య లేదు. తల్లినీ, శిష్యులనూ రానిచ్చారూ, ఎచ్చమ్మ నివేదన స్వీకరించారు. నిర్గుణమూ నిష్క్రియమూ నిరాకారంగా కనబడినదే సర్వగుణమూ, సర్వకర్తా, సర్వాకారముగా అయినది అని ఆ రెంటినీ-ఇతర యోగులవలె వేరుచేయ కుండా ఒకటి చేసుకున్నారు. అందరికీ ఈ తోపకము యథాలాపమే అయితే జ్ఞానులందరూ 'అహం భోజనం నైవ భోక్తా' అనక 'అన్నం బ్రహ్మ, భోక్తా బ్రహ్మ అహంచ బ్రహ్మ' అనే అనియుండేవారు. సమాధిదశకు తర్వాతి దశలో ఎన్నాళ్ళు తనంతట తానే వున్న సర్వములో అకర్తా, అరూపీ, అసంకల్పీ అయిన స్థితిశక్తి (potential energy) మట్టుకే సత్తు అని అనిపిస్తుందో, అన్నాళ్ళూ 'అదః పూర్ణం' అనే స్ఫురణే వుంటుంది. న్యాయమే కదా!.... 'మారుతూ వుండడముకూడా నిత్యమే. శక్తి అన్నప్పుడు తటస్థముగానూ వుంటుందీ ప్రస్ఫుటముగానూ వుంటుందీ; కదలని పర్వత సరోవరమూ నీరే. దానినుండి వచ్చే నిర్ఝరమూ నీరే' అను కున్నప్పుడే 'అదః ఇదం, చేరినదే పూర్ణము' అన్న స్ఫురణ కలుగుతుంది. ఆ 'రెండూ' (వాస్తవానికి రెండు కావు, వ్యవహారానికే రెండు) ఒక దానివే. అంతా అదే అన్నదే నిండైన స్ఫురణ. 'తత్ సత్' అన్నది సగమూ 'వస్తువు నాశనము గాదు' అన్నది సగమూను. 'శక్తి (స్థితీ గతీ) నిత్యము' అన్నదే పూర్ణసత్యము.

సమాధి అనుభవము పొందినవారికి అహం పూర్తిగా పోదు, అని చెప్పి పరమహంసులవారు, 'కొంతసేపటి బ్రహ్మానుభవముతో జీవితాశయము అందిరాదు' అన్న పరమ సత్యాన్ని మనకు హెచ్చరించారు. మనము సమాధి అను భవమే పరమ-గమ్యము కాదూ, సహజ సమాధే గమ్యము అని చెప్పుకున్నాము. పరమహంసులవారు సమాధితో అహం పోదు అని చెప్పి ఆ మన అనుమానానికి ఆధ్యాత్మిక అధికార ముద్ర వేశారు; అది ఒక లాభము. 'అహం' అనగానే అందరు ఆధ్యాత్మిక యాత్రికులలోనూ మిగిలివుండేదే. ఈ శత్రువుని మనము యోగ మార్గములో సాగే యాత్రికులలో ముందుగా గుర్తించి, తక్కినదారులలో సాగే వారిని ఈ శత్రువు ఎలాగ నిరోధిస్తాడో చూసుకుంటే ఆధ్యాత్మయోగ గమ్యమే కాక ఇతరమార్గ యాత్రికుల చిక్కులూ గమ్యాలూ కూడా స్ఫుటమౌతాయి. ఇది రెండో లాభము.

రామకృష్ణ పరమహంసా తోతాపురీ భక్తునికీ జ్ఞానికీ గొప్ప ఉదాహరణాలు. వీరి సమావేశాన్నీ ఫలితాన్నీ విమర్శించుకుంటే తెలుస్తుంది మనకి భక్తులా జ్ఞానులా చివరి పరిణామము రామకృష్ణపరమహంస విశ్వమంతటా సృష్టిస్థితి లయాలు జరుపుతూండే మహాశక్తిని కాళీ రూపములో అర్చించారూ, తోతాపురి సర్వమూ అయిన సత్తను నిర్వికార రూపములో అనుభవించే యోగసాధన చేసారు. రామకృష్ణస్వామి దేవాలయము మెట్లమీద కూర్చుని దేవి సాక్షాత్కారాన్ని ఆనందిస్తూంటే తోతాపురి ఆ దారిన పోతూ చూచారు. ఆయన

సమాధి స్థితిలో చాలా దూరము సాగినట్లు తోతాపురికి తోచి, 'తరవాతి దశకు నీకు దారి చూపుతా, నన్నారు. రామకృష్ణ స్వామికి అప్పటికి ఉన్న ఆ స్థితి ఎలాగు వచ్చిందో ఆయనకు అవసరము లేదు. నిర్వికల్పసమాధి–తాను పొందిన బ్రహ్మ మయస్థితి – రామకృష్ణకి రావాలి. సరే, వచ్చింది. ఉజ్వల నీలదేహ సృష్టి స్థితి లయ కర్త్రి కాళీమాత నతిక్రమించి ఆకాశమువలె అనంతమూ ఏకమూ శుక్రమూ అయిన బ్రహ్మ మును చూచారు రామకృష్ణస్వామి. మళ్ళా ఆనాటి సాయం కాలపు సంకీర్తనలో అంతా పాలించే కాళికాదేవిముందు వామనుడైపోయి ఆయన చప్పట్లు చరుస్తూంటే చూచి, తోతాపురి "(అంతా బ్రహ్మమే అయినప్పుడు కాళీ వేరే ఎవరూ? అంతా ఐన నీవు అర్చించ వలసిన దెవరిని? రెండు లేవు గదా? అయితే మరి ఇప్పుడు నీవు చేసే దేమిటి?) రొట్టెలు ఒత్తు తున్నావా?" అని అడిగేరట. రామకృష్ణస్వామి నవ్వి ఊరు కున్నారు. మర్నాడు తోతాపురి వేల్చిన అగ్నిహోత్రపు బూడిదను నౌకరు తుడవబోతే "దాన్ని నీవు ముట్టకు" అని అరిచారు ఆయన. రామకృష్ణస్వామి నవ్వి చప్పట్లు కొడుతూ చూచారా? (అంతా బ్రహ్మమే అయినప్పుడు మీరు వేరూ వాడు వేరూనా? 'నేను' 'నువ్వు' అనుకోడము మాయా ప్రభా వమువల్లనే కదా? నిన్న నేను భజనలో చప్పట్లు చరు స్తూంటే 'ఎవర్ని నువ్వు భజిస్తున్నావు?' అన్నట్టు వెటకారం చేశారే మరి మీరు ఇప్పుడు 'నా' 'నీ' అనడము లేదూ?) మీరుకూడా మాయా ప్రభావానికి లోబడి పోయూరే!"

అన్నారు. తోతాపురికి తన బలహీనత తెలిసివచ్చింది. 'నిజమే నా, నీ అన్నవి లేవు ఉన్నదంతా ఒకదానిదే' అని ఆయన మననము చేసుకుని, ఆ వేదాంతమును రామకృష్ణ స్వామికి "నువ్వు దైవము అంటూ భజన చెయ్యడానికి అంతా అయిన నీలోంచి ఈ నీవంటూ వేరై పోయి మిగిలిన దానికి ప్రపన్నుడవు కావడము ఎందుకూ? సమాధిలో అంతా ఒకటే అయినట్లు చూచావు కదా? అదే నీవై ఉండు" అని బోధించారు. ఇలాటి బోధననే తోతాపురినుంచి రామకృష్ణ స్వామి పదినెలలు విన్నారు. కాని వారిలోని భక్తి బీజము పోలేదుట' కారణము ఏమిటీ అని ఆలోచిస్తే నాకొకటి స్ఫురి స్తున్నది. రామకృష్ణస్వామి భక్తిని హోదాగా వాడుకునే భాగవతార్ కాడు. మరి పరమప్రపన్నుడు. జగత్తంతటినీ పాలించి శాసించే కాళీమాత ఆశ్రితుడు ఆయన. తోడి మానవు లలో తనకు హోదాయే లేదు. అమ్మఅనుగ్రహమే ఆయన బ్రతుకుబాట. కనుక సమాధిలో అంతా తానే అయిన బ్రహ్మ ముతో తాదాత్మ్యము కలిగినా మిగిలేవుండిన ఆయనగారి వినయాహంకారము – తానొక అల్పమానవుణ్ణనే అడకువ - మళ్ళీ వచ్చి దానిచోట్లో కూర్చుంది. ఇది ఎవరికీ బాధా కరము కాలేదు. ఆయన జీవితాంతమువరకూ ఆయనతోనే వుంది. చివ్వరికి, ఆయన కంఠంలో పుట్టకురుపు పుట్టి ఏమీ తినడానికి ఆస్కారమే లేనప్పుడు వివేకానందస్వామిచేత అడిగించారు ఇతర శిష్యులు, 'ఏమైనా ఆహారము తీసుకో డానికి అవకాశము కల్పించమని అమ్మను అడగరాదా?' అని.

వివేకానందులు అడిగితే రామకృష్ణస్వామి అన్నారు "ఇన్ని నోళ్ళద్వారా తింటున్నావు చాలదా? ఆ నోటితోనే తినాలా? అని అమ్మ అంటే ఏం చెప్పమన్నావూ" అని! అప్పటికి అందరు ప్రాణులతో తాదాత్మ్యము వచ్చింది పరమ వినయ శీలి రామకృష్ణస్వామికి, రామకృష్ణస్వామికివలె వినయాహంకారము కాక నామదేవునికివలె అతిశయాహంకారముంటే అది ఎలాగ సర్దుకుంటుంది? ఈ ప్రశ్నను కొంచెము ఆపి, తోతాపురిస్వామి అహంభావమును అనుసరిద్దాము. అది అయిన తర్వాత నామదేవుడిదగ్గరకి వద్దాము.

రామకృష్ణస్వామి దక్షిణేశ్వరములో తరచు పంచవటి దగ్గరుండేవారు. అక్కడ ఆయన తోతాపురిస్వామికి పాటలు పాడి వినిపించేవారట. వాటిలో ఒకటి: "ఓ అమ్మా! నే నెవరినీ నిందించలేను. ఈ చేతులు త్రవ్విన నూతిలోనే మునిగిపోతున్నా నమ్మా. ఆరు భావాలనూ పారగా ఉపయోగించి పవిత్రమైన ఈ భూమిలో తవ్వేను గొయ్యి. ఇప్పుడు మృత్యువనే నల్లని నీరు పొడుచుకువస్తోంది. ఓ పరమ కారుణ్యవతీ నాకిపుడేది రక్ష?" ఈ పాట విన్నప్పుడు తోతా పురికి కళ్ళ వెంబడి నీళ్ళు గిర్రున తిరిగేవట. వాటిని గుర్తించి ఆయన "ఇదేమిటి? మాయలో పడుతున్నా నూ?" అని కలతపడేవారట. నలభై యేళ్ళు ఆయన చేసిన యోగాభ్యాసములో దైవాన్ని ఎంచి ఉండక పోవచ్చును గాని, 'షడ్రిపులూ' 'కూపమూ' 'మృత్యువూ' 'రక్ష' అన్న మాటలలో మూడు ఆయన దారిలోనూ పరిచయములే. ఆ పాట

వినడముతో శరీరానికీ మనసుకీ స్వభావమైన జాలి ఆయన లోని జ్ఞాని తొక్కిపెట్టిన ఆయన మానవత్వాన్ని జల్లు జల్లు మనిపించింది. 'నాకు స్వాధీనముకాని దేమున్నదీ?' అన్న యోగిగారికి రక్త గ్రహణివల్ల శరీరము శుష్కించి సమాధి స్థితికి లేచే శక్తి లేకపోయింది. గంగలో పడిపోదాము అని వెళ్ళి పడిపోలేక తిరిగివచ్చాడు! మిథ్య అని తోసివేసిన శరీరమూ దేహాత్మబుద్ధీ, నాత్వమూ అన్నీ గుమికూడి తోతా పురిమీద విరుచుకు పడ్డాయి. సమాధిస్థితి వచ్చే తొలి రోజు లలో ఆ స్థితిలోని సర్వత్వాన్ని జాగ్రదవస్థలోని అల్పత్వ వైవిధ్యాల్ని పోల్చుకుని, ఈ వైవిధ్యమూ అల్పత్వమూ ఆ సర్వత్వానివే అని రంగరించుకుని ఉండలేదు. ఆయన. ఇప్పుడు ఆయనకు తన సమాధిస్థితి ఘనత ప్రక్కనే - గంగలో పడిపోనివ్వని-పొడుగాటి నీడ చాచిన శరీరాభిమాని కనపడింది. శరీరాభిమానాన్ని సమాధిస్థితిలోని పెద్ద నేను లోనిదే నని దానిముందు సాష్టాంగము పడవేసి అర్పణమే చేశాడో 'ఇదే అది' అన్న ధ్యానమే చేశాడో, "నువ్వు చెప్పిన మాయ అతిశక్తిమంతము" అని రామకృష్ణస్వామితో ఒప్పు కుని, శక్తికూడా బ్రహ్మదే అని నిబ్బరము చేసుకోడానికని బయలుదేరి వెళ్ళిపోయాడు తోతాపురి. నాకు చూడగా, ఆయన చివ్వరికి చేసినది- ఎంత కాదన్నా ఆత్మ కాకపోని - ఆత్మేతరమే అని ఆయన అనుకున్న దేహబుద్ధి అర్పణమే. ఇప్పుడు, వేరేగా మరి మిగిలివుండిన - నౌకరును అదలిం చిన - తోతాపురి మరి లేడు. సర్వం ఖల్విదం బ్రహ్మ. వేద

వ్యాసుడు భాగవతము రచించడములో ఇలాంటి ఆత్మార్పణమే చేశాడంటాను. ఆయన ప్రజాహిత కార్యములనే హృదయ పూర్వకముగా చేస్తూండినప్పటికీ ఆయనకు సంతోషము లేకపోయింది. (భాగవతము 1-4-26). బరువైన గుండెతో ఆయన సరస్వతీ నదీతీరంలో కూర్చుని మనసులో నెమరు వేసుకుంటూండినాడు. "బ్రహ్మచర్య వ్రతధారినై నేను శ్రద్ధతో వేదములు చదివి, గురుజనమును సేవించి అగ్నుల నర్చించి ధర్మమార్గంలో నడిచినాను. స్త్రీలూ శూద్రులూ తమ ధర్మము గుర్తెరుగుటకు వీలుగా వేదార్థమును భారతముద్వారా పలికినాను. జ్ఞానులలో జ్ఞానినై అసాధారణ శక్తిమంతుడనైనప్పటికీ నాకు నా బ్రహ్మైక్యత తెలిసిరాలేదు. పరమ పురుషుని పొందగల సుగుణాలను పూర్తిగా వర్ణించక పోవడము వల్లనా?" అని వ్యాసుడు కాతరుడై దుఃఖిస్తుండగా నారదులవారు ఆయనను చేరినారూ వ్యాసుని ఘనతను పొగడినారు. 'మీరన్నది నిజమే. కాని నా ఆత్మకు శాంతి లేకున్నది. కారణము మీరే చెప్పవలెను' అన్నారు వ్యాసులు. "నీవు పురుషార్థములనే వర్ణంచినావు గాని వాసుదేవుని విభూతిని పూర్తిగా వర్ణించలేదు. భాగవతము రచించు"మన్నారు నారదులు. వ్యాసుని జయస్తంభము ఎంత ఎత్తుకి లేచినా ఆకాశమును అందుకోలేదు! అదీ ఆయనగోల! భాగవత రచనతో ఆయన 'చిన్న నేను' యొక్క అతిశయము విష్ణువిభూతిలో కరిగిపోయింది. అంతా

తానే అయినట్టిదే ఆయన చేతులతో రాసుకున్నదీ చేసుకున్నది. 'నేను' ఒకణ్ణి వేరుగా లేనని ఆయన గ్రహించారు సర్వం ఖల్విదం బ్రహ్మ. చిత్ర మేమిటంటే అంత గొప్ప భక్తుడైన నారదుడు అన్ని లోకాల్లోనూ సంచరించగలాయన, విష్ణుమూర్తిని నామ పరిమిత వ్రతిభునిగా అర్థము చేసుకోడమువల్లనే అయివుండాలి. 'శోకిస్తున్నాను, నన్ను శోక సముద్రమునుండి దరిజేర్పవలెను' అని వేడుకొని సనత్కుమారుని కడ కేగి జ్ఞానము అధ్యయనము చేయవలసి వచ్చింది. దానితో విష్ణుమూర్తీ తానూ సర్వలోకాలూ, ఉన్నదంతానూ ఒకటే అని ఆయనకు తెలిసివచ్చింది. సర్వం ఖల్విదం బ్రహ్మ.

నామదేవునికి పాండురంగ విఠలస్వామి ప్రత్యక్షము. అట్లని ఆయనకు అతిశయమూ ఉండేది. ఒకనాడు ఘోరా కుంభారు నింట పండరిపుర మహాత్ములు నామదేవ, జ్ఞానదేవాదులు విందు గుడిచి కూర్చుని ఉండినప్పుడు జ్ఞానదేవుడు అన్నాడట "ఏమోయి కుంభారూ, నీవేమో కుండలను చక్కగా నాణెము చేస్తావట. ఇక్కడ ఇన్ని కుండలు కూర్చున్నాయి. నాణెము చెయ్యి"అని. ఘోరాకుంభారుడు లేచి ఒకొక్కరి దగ్గరకూ వెళ్ళి చేతి వ్రేలికణుపుతో కుండమోగించినట్టు కొడుతూ వెళ్ళేడు. నామదేవుణ్ణికూడా అందర్నీ కొట్టినట్టే కొట్టేడు. అందరూ, మహానుభావుడైన

ఘోరాకుంభారుని మీద గౌరవముతో ఊరుకున్నారు. నామ దేవుడికి తానేమో ప్రత్యేకపు గొప్ప భక్తుడని అతిశయము. కనక "ఏమయ్యోయ్ నన్నూ కొట్టావే" అన్నాడట.

ఘోరాకుంభారు "ఈ కుండ పలుకుతున్నది. ఇది ఓటిది," అన్నాడట. అందరూ గొల్లుమని నవ్వేరు. నామ దేవుడికి అవమానమై ముఖము వ్రేలవేసుకుని స్వామి దగ్గరకు వచ్చాడు.

"ఏమయ్యోయ్ ముఖము వేల వేసుకున్నావ్?" అని అడిగేరు స్వామి.

"ఘోరాకుంభారు ఇలాగ అన్నాడు స్వామీ. అందరూ నవ్వేరు. నువ్వూ ఊరుకున్నావు" అన్నాడట నామదేవులు.

"ఏం చెయ్యమన్నావు? ఘోరాకుంభారు నిజమే చెప్పేడు మరి!"

"నిజము చెప్పేడా! అయితే నన్ను దిద్దు స్వామీ."

"నేను కాదు. ఊరవతల పాడుగుళ్లో పడుకుని వుంటాడు ఒక జ్ఞాని. ఒంటిమీద గుడ్డ సంగతికూడా అంతగా స్ఫురణ వుండదు అతనికి. కొంచెము గలీజుగా కూడా వుంటుంది అతని చుట్టూ. అయినా ఏవగించుకోకు. అతడు దిద్దుతాడు నిన్ను" అన్నారు స్వామి.

నామదేవుడు ఆ పొద్దు దేవాలయానికి వెళ్ళాడు. అక్కడ ఒక యోగి మహా గలీజుగా వున్నచోట పడుకుని వున్నాడూ, వంటిమీద గుడ్డ సరిగ్గా లేదు. కాళ్ళు ఒక లింగము మీద పెట్టుకుని పడుకున్నాడు, నామదేవు డది చూచి కంగారుపడి, "ఏమండోయ్ లేవండి లేవండి" అన్నాడు.

ఆయన కళ్ళు తెరచి "ఏం, పాండురంగస్వామి పంపేడా?" అన్నారు. నామదేవుడికి ప్రాణాలు ఎగిరి పోయాయి. చేతులు జోడించి, "లింగముమీద పాదాలు పెట్టుకుని పడుకున్నారు; న్యాయమా?" అన్నాడు. "పెద్దవాణ్ణి నాయనా, కాళ్ళు కదుపుకోలేను. లింగము లేని చోటికి కాళ్ళు కదుపు నాయనా" అన్నారు ఆ యోగి. నామదేవుడు ఆయన పాదాలు పట్టి ఎత్తి పక్కకి పెడితే అక్కడొక లింగము! మళ్ళీ కదిపి పక్కకి పెడితే అక్కడ ఇంకొక లింగము! నామదేవుడు ఆలోచించాడు "లింగము లేని చోటే లేదు. అవును లింగము లేని చోటెక్కడుంటుంది? స్వామిలేని చోటే లేదు. ఘోరాకుంభారుగానూ వున్నాడూ నేనుగానూ వున్నాడూ, నవ్వినవారుగానూ ఉన్నాడు" అని అనుకున్నాడు. ఇక తిన్నగా గుడికి పోలేదాయన! ఎక్కడ అవకాశముంటే అక్కడ విశ్రమిస్తూ తిరిగేడు.

నాలుగైదు నెలలకు అలవాటు చొప్పున కాళ్ళు ఆలయంలోకి తీసుకు వెళ్ళాయి. "ఏమయ్యోయ్ కనిపించడము మానేశావు?" అన్నారు స్వామి. నామదేవుడు "అంతటా

కళ్ళున్న నీకు కనిపించకపోవడమేమిటి స్వామీ? నీవు లేని చోటంటూ ఉన్నదా? ఘోరాకుంభారుగా జ్ఞానదేవునిగా నేనుగా అంతటా నీవుగాక ఇంకేమి కలదు?" అన్నారు.

"ఇప్పుడా కుండ ఓటిది కాదు" అన్నారు స్వామి.

భక్తులకూ జ్ఞానులకూ కూడా "అంతా అదే" అని తెలియడమే గమ్యము. అటు సమాధిస్థితి పొందిన వాడికీ స్వామి దర్శనము పొందిన వాడికీ 'అంతా అదే' అని వెంటనేగానీ, దానంతట అదేగానీ తెలియరాదు. ఆయన 'ఇదీ అదీ ఒక దానివే' అని తెలుసుకోవాలీ, దానికి యత్న మవసరము. త్యాగరాజు 'ద్వైతము సుఖమా అద్వైతము సుఖమా' అనుకున్నాయన "జగము నిండి ఉండేది రాము డొకడు" అని తెలుసుకున్నాడు.

# అంతా అదే

'అయితే రూపకల్పన చేసుకుని స్వామిని ప్రత్యక్షము చేసుకున్నా, యోగసాధన చేసి నిరాకార సత్తను అనుభవించినా జీవితాదర్శము ఇంకా దూరముగానే వుండే మాటయితే ఈ రెండింటిలోనూ ఏ వొక్కటీ అనుసరించకుండా ఇంకొక దారిలో జీవితాదర్శాన్ని చేరడానికి వీలున్నదా?"

ఉన్నదనేకదా మొదటలో మనవిచేశానూ? 'అమ్మ ఏదైనా కొత్తదారీ సులువైనదారీ సూచించారా?' అని మీ రడిగితే, ఉన్నదని చెప్పి నిర్వికల్ప సమాధి అన్నది నిర్వికల్పము కాదనీ అదే గమ్యము కాదనీ చెప్పుకొచ్చాను.

'అవును - అయితే చెప్పండి అమ్మ సూచించే కొత్త దారి ఏమిటో?'

దారి చెప్పేముందు గమ్యాన్ని నిశ్చయము చేసుకోవాలి కదా?

'అంతా అదే అని తెలుసుకోడమే అన్నారుగదా?'

మాట అనేస్తే సరిపోయిందా? మనస్సులో నిశ్చయము చేసుకోవద్దూ?

'ఎలాగ చేసుకోడమూ?'

విచారమువల్ల.

'శాస్త్రాలు చెప్పి ఉన్నాయి కదా?'

చెప్పేయి. అయితే మతాలు చాలా వున్నాయీ, ఒక్కొక్క మతానికీ శాస్త్రాలున్నాయి.

'అవన్నీ చదివి, ఆలోచించి ఎవరికి వారు గమ్యాన్ని నిర్ణయించుకోవాలా ప్రతివారూ?'

కొన్ని మతాల వారి లాగ 'సత్య మిదీ, గమ్య మిదీ, దారి ఇదీ అని నమ్మి జీవితము గడపగలిగితే మంచిదే. అయితే, మనము నమ్మేముగదా అని ఇతరులకు అందించాలంటే, వారూ వాటిని నమ్మేటట్టు విశదము చెయ్యాలి. అప్పుడుగదా వారు వాటిని నమ్మడమూ?

'ఇలాగ అంతమందిని అన్ని కాలాలపాటూ నమ్మించగలమా?'

యథాశక్తి ప్రయత్నము చెయ్యడమే. గత్యంతర మేమిటి? మనము నమ్మాలన్నా ఆధారాలుండాలిగదా? ఆ ఆధారాల్నే ఇతరులకూ చూపిస్తాము. ఇంచు మించు మనకి మనము చెప్పుకున్నట్టే.

'చెప్పండి.'

తెట్టతొలి తాత్త్విక చింతన పూర్వమీమాంసకులనే పురోహిత వర్గము వారిదే ననిపిస్తున్నది. వారు మంచిపనులు చేసినా ఆ పనుల ఫలితము ఊరికే పోదు కనక అది అనుభ వించడానికి మరణానంతరము ఆత్మ ఉండాలి అన్నారూ, అది స్వర్గలోకంలోనో (నరకలోకంలోనో) సుఖములు (లేదా కష్టములు) అనుభవిస్తుందన్నారు. వారి నమ్మకము ప్రకారం అష్టాదశ కర్మలు చేస్తూ ఐహికసుఖాలూ ఆముష్మిక సుఖాలూ అనుభవించడమే జీవితాదర్శము. జీవులూ ప్రపంచమూ స్వర్గనరకాలూ శాశ్వతాలు. జీవుడికి ఆదీ అంతమూ లేదు.

'దేవుడో?'

కర్మలకు ఫలాలు వాటంతటవే వస్తాయి. కనక ఈశ్వ రుడు అవసరము లేదన్నారు.... సాంఖ్యులు పూర్వ మీమాంసకులతో ఇంచుమించు సమకాలికులే. ప్రపంచాన్నీ ప్రాణినీ సాంఖ్యులు విమర్శగా పరిశీలించి, విశ్వమంతటినీ పురుషులూ ప్రకృతీ అని రెండు అనాది తత్త్వాలుగా విభ జించుకున్నారు. పురుషులు చైతన్యములు, నిర్గుణములు,

సాక్షిమాత్రులు, మారరు. ప్రకృతి అచేతనమూ, సత్త్వ రజస్తమోగుణ సహితమూ. పురుషుని సన్నిధానములో సృష్టిగా అవుతుంది, అతని భోగము కోసమూ కైవల్యము కోసమూను. పురుషులు ప్రకృతిలో చేరి జీవులైనారు. జీవుని బ్రతుకు శారీరక, దైవిక, భౌతిక దుఃఖాలతో బాధామయము. దీనికి కారణము అతడు తనసంగతిని తెలుసుకోక పోడము. అతని రజస్తమో గుణాలే జ్ఞానానికి ముఖ్య ప్రతిబంధకాలు. అష్టాంగయోగమువల్ల ఈ గుణాల్ని జయించి అంతఃకరణమును నిర్మలము చేసుకోడమువల్ల జీవుడు తాను ప్రకృతికి భిన్నుడైన పురుషుణ్ణి తెలుసుకుంటాడు. తాను చూడబడ్డానే అన్న బిడియమువల్లనా అన్నట్లు ప్రకృతి ముక్త పురుషుణ్ణి మరి చేరదు. అంటే 'ప్రకృతి వియోగమే మోక్షమూ, జీవితాదర్శమూనూ' అంటారన్నమాట సాంఖ్యులు. మనకి గుణాలతో సంబంధము లేదనీ మనము చైతన్య స్వరూపులమే ననీ చక్కగా తెలుసుకోడము జీవితాదర్శముట. దానికి దారి శమదమాది సాధనాలతో కూడిన యోగము. ఇది పూర్తిగా మనచేతుల్లోని పనే అంటారు సాంఖ్యులు. సాంఖ్యులు చేప్పే ముక్తి, పూర్వ మీమాంసకుల స్వర్గమువలె మరణానంతరము అనుభవిస్తా మనేది కాదు. ఈ బ్రతుకులోనే యోగమువల్ల సాధించవీలైనదే. అయితే ముక్తునికి గుణాలతోనూ రాగద్వేషాలతోనూ పని ఉండదూ, శారీరక దైవిక భౌతిక దుఃఖాలుండవు. 'నేను చైతన్యమయుడను, ఈ ప్రకృతితో నాకు

సంబంధము లేదు. నేను నిత్యముక్తుడను' అనుకుంటాడు (సాంఖ్యము చెప్పే) ముక్తుడు.

'అవధూతగీతా అష్టావక్రగీతా నిర్వాణాష్టకమూ సాంఖ్యుల ముక్తినే చెపుతూన్నట్టున్నాయే - 'నేను అది కాదు, ఇది కాదు, చిదానందరూపః శివోఽహం శివోఽహం' అంటూనూ?'

అవును. సాంఖ్యము 'ప్రకృతి వున్నదిగాని ముక్తుడికి దానితో సంబంధమే లేదు' అంటుందీ, అద్వైతులు ప్రకృతిని 'మాయ,' 'మిథ్య' అంటారూ, ముక్తుడి దృష్టిలో ప్రకృతి లేనే లేదంటారు.

ఎందువల్లనో?

ప్రకృతి పురుషులూ అని రెండు స్వతంత్ర నిత్య పదార్థాలున్నాయని అంటే 'ఆ రెండూ ఎందువల్ల దగ్గర చేరేయీ' అన్న ప్రశ్న వస్తుంది. ఒకటీ, 'పురుషులంతా క్రమంగా ముక్తులై పోతే ప్రకృతి గతి ఏమవుతుందీ?' అన్న ప్రశ్న పుడుతుంది. రెండూ చిక్కులు. 'పురుషుణ్ణి అజ్ఞానిని చేసి ఏడిపించడానికీ, చివరికి ఆ మార్గంలో కైవల్యానికి దారి చెయ్యడానికీ, నా ప్రకృతి వున్నదీ?' అన్న విమర్శ సాంఖ్యానికి బలంగా తగులుతుంది.

'అద్వైతము మాత్రం మాయావరణవల్ల జీవుడికి జరిగేది అంతేనని తేల్చటములేదా?'

అవును అద్వైతమూ సాంఖ్యమూ కూడా సృష్టి జరగడానికి కారణాన్ని చెప్పవు. సృష్టి - అనగా ప్రకృతి పురుష సమావేశము - అనాది అంటుంది సాంఖ్యము. కాని రెండూ 'ఆ సమావేశము అంతము గలది' అని అంటాయి. సాంఖ్యము ప్రకృతిని నిరాధారంగా వదిలేస్తుంది. సర్వజీవ సాయుజ్యానంతరము అద్వైతము మాయని బ్రహ్మములో లీనము చేస్తుంది. రెండూ కూడా ముక్తిని ఈ జీవితంలో పొందదగిన స్థితే అని చెప్పి తక్కిన తత్త్వాలన్నిటికన్నా 'ముక్తి దాఖలా ఉన్నది' అన్న బలము కూర్చుకున్నాయి.

'ఏం అలాగ అన్నారూ?'

'చచ్చిన తర్వాత ఇది అవుతుందీ అది అవుతుందీ' అని చెప్పిన వారిది ఎంత వాదించినా చివరికి నమ్మకమే అవుతుంది. 'ఈ జీవితంలోనే పొందదగిన స్థితి' అని అంటే ఋజువుకోరేదీ, దాని కోసం వెతికేదీ, అమ్మా మహర్షిలాంటి వారిలో గుర్తించ గలిగిన స్థితీ. అవుతుంది. దీనికి నిరూపణ వీలు; అది మాత్రము విశ్వాసముగానే నిలిచి పోతుంది.

'అంటే మీరుకూడా ముక్తి ఈ జీవితంలోనే సాధించేస్తా రన్నమాట!'

'సాధ్యమే, ముక్తులున్నారూ-అంటాను. నా సంగతీ మీ సంగతీ నేను ప్రస్తావించలేదే?'

'అది సరే లెండి. చెప్పండి జీవితాదర్శాన్ని గురించి ఇతర అభిప్రాయాలు.'

సర్వేశ్వరుడున్నాడనీ, ఆయనను భక్తి ప్రపత్తులతో సేవిస్తే సాలోక్య, సామీప్య సారూప్య ముక్తులు ఇస్తాడనీ చెప్పేవీ నమ్మకాలే. అవుననడానికి 'శాస్త్రాలు అన్నాయి' అని చెప్పాలి గాని నిరూపణ ఏదీ లేదు. 'సారూప్యము కూడా లేదూ, సాలోక్య సామీప్యాలే' అని క్రైస్తవమతమూ మధ్వ మతమూ అంటే సారూప్యమూ ఉన్నది అని రామానుజ మత మంటుంది. నిరూపణో?

'సాయుజ్యమును వదిలిపెట్టేశా రేమి?'

సహజస్థితి సాయుజ్యమే కదా? — అది ఈ జీవిత ములో సాధ్యమని అన్నారు గదా? పైమూడూ మరణా నంతరమేగాని ఈ జీవితములో సాధ్యాలని ఎవరూ అనరు గదా? 'సహజస్థితిలో ఉన్నవారిరుగో' అనడానికి వీలున్న ప్పుడు దానికి నిరూపణ ఉన్నట్టే.

'చెప్పండి.'

మనము ఎక్కడనుండి వచ్చామో ఎక్కడకు పోతామో మనకు తెలియదుగదా? ఆ రెండింటి ప్రశంస లేకుండా చెప్పాలి జీవితాదర్శము.

"ఋణం కృత్వా ఘృతం పిబేత్- అన్నారుగా?"

అవమానమో, జైలో, దెబ్బలో వస్తే హాయిగా స్వీక రిస్తారా ఆ అన్నవారు.

'....................'

జీవితంలో అంతా సుఖమేగానీ, అంతా దుఃఖమేగానీ, అనుభవించే వారెవరూ ఉండరు. కనక ఏది వచ్చినా ఎగిరి పడని మనఃస్థితే జీవితాదర్శము.

'ఇంకేం, స్థితప్రజ్ఞ చెప్పేరూ.'

పేరేదో చెప్పగానే అది వచ్చేసిందా? స్థితప్రజ్ఞా, జీవన్ముక్తి గురించీ వేదాంతప్రకరణ గ్రంథాలు ఎంతెంతో చెప్పేయి. దానికి సాధనమో!

'అమ్మ ఏమేనా చెప్పేరా?'

"ఏది జరిగినా ఎవరు ఏది చేసినా మనం కాదు చేసేది- మనలను అందరినీ నడిపించే శక్తి మరొకటి ఉన్నదనుకో" మన్నారు.

'అంటే దేవుడని కాదూ?'

శక్తి అంటున్నారుగా? విశ్వాన్ని నడిపించే శక్తి - ప్రకృతి సూత్రాలంటారే? - వాటిని నిలబెట్టే శక్తి - మనం ఏదేనా మంచో చెడ్డో చేదామనుకుంటే అడ్డు అవుతూంటుందే,

శక్తి - మనకు అర్థంకాకపోయినా వున్నదనపించే శక్తి. ఆశక్తే అన్నీ నడుపుతోంది అనుకోమన్నారు అమ్మ.

'మనదేమిన్నీ లేదనా?'

మనము మన పనులని అనుకునేవీ, ఇతరులవని అనుకునేవీ, ఎవరివనేనా అనుకునేవీ, అన్నీ ఆ మహాశక్తే నడుపుతోంది. ఈ మనమూ, ఆ వారూ, ఇంకా ఎవరో కాదూ నడిపేదీ. కనక హాయిగా స్వీకరిద్దామూ అనుకోమంటున్నారు.

'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ'అనా?

ఒకరిని ఎవరినీ శరణు పొందమనలేదే? పరిత్యజించమనీ అనలేదే? జరిగినదేది అయినా, నీ చేతులూ నా చేతులూ కాదూ జరిపించినది, అన్ని చేతుల్నీ నడిపే శక్తే నడుపుతున్నదీ, కనక నవ్వుతూ అనుభవించమనీ.

'నవ్వుతూనా?'

జరిగేటివి మీ వల్లా నా వల్లా అయితే మెప్పో ఏవగింపో. అన్నిటినీ నడిపే శక్తి నడుపితే?

'నాకు అనుకూలం కాలేదని విచారం.'

విశ్వమంతటినీ నడిపేశక్తి ఈ ఒకరి సౌకర్యం కోసమూ ఆ వొకరి అసౌకర్యం కోసమూ వాన కురిపించదు

కదా? కనక ఏం జరిగితే దాన్ని హాయిగా – వానని వలెనే– అనుభవించడమే కదా కర్తవ్యం?

'యత్నం చెయ్యకుండానా?'

ప్రేరణ ఎవరిది? ప్రేరణ వస్తే అది ఆ శక్తిదను కోడమూ చెయ్యడమూను.

'చెయ్యడము మనదేనా?'

అలాగ అనుకున్నాళ్ళూ మనమే చేస్తున్నాము– అనిపిస్తుంది గదా అని, మనకు ప్రేరణ అదీ అని చూపించడము.

'ఆ తరవాత ఏమనిపిస్తుంది?'

చేసుకునేదీ, అదే అనిపిస్తుంది.

'చివ్వరికి?'

అంతా అదే అని.

# శ్రవణము

'అంతా అదే అంటే?'

కనబడే రూపాలన్నీ, క్రియలన్నీ, సంకల్పాలన్నీ గుణాలన్నీ దానివే అని.

'మంచీ చెడ్డా, పాపమూ పుణ్యమూ- అన్నీనా?'

సుగంధమూ దుర్గంధమూ, అన్నమూ అశుద్ధమూ, గొప్పవనీ చిన్నవనీ అన్నీనీ. మంచీ చెడ్డా అంటే ఏమిటి? ఏ సంఘంలోనైనా మంచి అన్నది ఆ సంఘ నియమాలకు అనుకూలమైనదీ, చెడ్డ అన్నది ప్రతికూలమైనదీను. ఇంకొక సంఘములో ఈ నియమాలు వ్యత్యస్తము కావచ్చు. పినతల్లి కూతుర్ని పెండ్లి చేసుకోడము మనకి పాపము,

ఇంగ్లీషువారిలో విధాయకము. భోజనంచేస్తూ త్రేన్పడము అక్కడ అమర్యాద; ఇక్కడ కాదు.

'కనక నియమాలను పాటించ నక్కర లేదన్నమాటా?'

ఏ సంఘంలోనైనా చిక్కులేకుండా మెలగాలంటే ఆ సంఘనియమాలు పాటించవలసినదే. దిగంబర జైనులూ అవధూతలూ వారి ఆశ్రమాలలోనో అడవులలోనో ఉంటే వారిష్టము. నగ్నంగా నగరాలలోకి వస్తే తిట్టరూ? మంచీ చెడ్డా దేశకాల పరిమితులకే పరిమితాలు. ఆ పరిమితులలోకి అవి రావడము కూడా విశ్వవర్తన స్వభావమే.

ఒకణ్ణి కుష్ఠురోగిగానూ ఇంకొకణ్ణి ఆరోగ్యవంతుడిగానూ, ఒకణ్ణి కోటీశ్వరుడిగానూ చెయ్యడమూ విశ్వవర్తన సుస్వభావమే కదా?'

'సు' అనగానే మీ అభిప్రాయము వచ్చిపడుతోంది. ప్రకృతి ఎప్పుడూ వైవిధ్యాన్నే వెంటబెట్టుకున్నది. 'వైవిధ్యము' అనగానే పొడుగూ పొట్టీ బరువూ తేలికానూ.

'బాధా సుఖమూ అన్నవి పొడుగూ పొట్టీ మాత్రమే అని అనుకోగలమా అని.'

'ఎవరో మహాధికారి మనందరికీ అనుభవాలిస్తున్నాడు' అని నమ్మినవారికి ఆ అధికారి ప్రాణుల నన్నిటినీ నిష్పాక్షికంగా చూడడము లేదని అనిపిస్తుంది. ఆ పక్షపాతం ఆయనకు జమ కట్టడం ఇష్టం లేక మన అనుభవాలు మనము

చేసుకున్న కర్మల ఫలితాలే అన్నారు కర్మ సిద్ధాంతులు. "పని అన్నది ఏది అయినా, చేసుకున్న తర్వాతనే కదా ఫలితము రావలసినదీ! మొదటి మంచికర్మగాని, మొదటి దుష్కకర్మగాని మనచేత చేయించిన సంస్కారము ఎవరి చ్చారు? అది – కర్మ ఫలితము అవడానికి అలాటి కర్మ ఏదిన్నీ అంతకుముందుది లేదు గదా?" అని ప్రశ్న వేస్తే సంస్కారమూ అనాదే, పుట్టుకా అనాదే అనేసి, చెప్పవలసిన జవాబును అనాది లోనికి తోశేస్తున్నారు. మన జీవితాల లోని భేదాలకు కర్మ సిద్ధాంతము కారణము చెప్పలేదు అని అనకుండా 'కర్మ అనాది, జన్మలు అనాది' అనేసి, ఆ భేదాల కారణాన్ని 'అనాది'లో కప్పిపెట్టేస్తున్నారు. కర్మసిద్ధాంతము రాజరిక కాలములోని బహుమానాలూ శిక్షలూ బట్టి నిర్మించు కున్నది. తొలిజన్మకు వర్తించదు. తొలి లేకుండా మలి ఎలాగుండగలదు?

'అమ్మ ఏమంటారు?'

తేడాల్ని గురించా? వైవిధ్యమేగదా సృష్టి అంటే? వైవిధ్య మంటే తేడాలే అంటారు.

'రాయీ రప్పాలో తేడాలుంటే వాటికేమీ బాధలేదు. మనుష్యులలోని తేడాలవల్ల ఒకడికి బాధా ఇంకొకడికి సుఖమూనూ. ఇవి అన్వయించుకోడము ఎలాగ?'

మనమంతా జగన్నాటకములో పాత్రల మనుకుంటే అన్వయము చేసుకోవచ్చు.

'ఎలాగా?'

నాటకములో ఒకడికి హరిశ్చంద్రపాత్రా, ఇంకొకడికి విశ్వామిత్రపాత్రాను. మరొకరికి చంద్రమతి.

'ఇక్కడ నాటకము ఎవరికి?'

తనకే, అంతా అయిన శక్తే సూత్రధారుడూ పాత్రలూ రంగస్థలమూ ప్రేక్షకులూ సర్వమూనూ. తానీ నాటకంలో ఒక పాత్రధారిననికాక, తాను రాజువేషము వేశాననీ బంటు వేషము వేశానని అనుకునేవాడు విశ్వామిత్రుడు నిజముగా తన్నేడనీ, మంత్రి తనకు బంట్రోతునులాగే కసిరేడనీ అనుకుంటాడు.

'పాత్రధారినని అనుకునేవాడో?'

జగన్నాటక సూత్రధారుడు నిర్ణయించిన మహా నాటకములో తన మూలలో జరగవలసినది జరుగుతున్నది అని తనకు 'మంచి' జరిగినా 'చెడ్డ' జరిగినా నవ్వుతూ అనుభవిస్తాడు.

'అయితే సూత్రధారుడూ పాత్రలూ వేరు వేరన్న మాటేనా?'

తాను పాత్రధారి ననుకున్న వాడికి వేరే. అంతా అయిన తానే అన్నీ అయివున్నాననుకునే వాడికి అన్ని నేనులూ తాను నేను అనే నేనే. వాడికి 'నువ్వు, అది, వాడు' అనేవి వేరు కాదు, "అవీ నేను 'నేను' 'నేనే'. మీరంతా నేనే, మీదంతా నేనే" అన్నారు అమ్మ కనక వాడికి, ఎవడు ఎవడికి ఏమి చేసినా, ఎవడు తనకు ఏం చేసినా, అంతా తానే చేసుకుంటున్నట్టూ తనకే తాను చేసుకుంటున్నట్టూ అనిపిస్తుంది.

'అలాగని అమ్మ చెప్పేరా? - మీరే అంటున్నారా?'

అమ్మే చెప్పేరు వినండి. మేమంతా ఉండగా "అంతా అదే అయితే నాకు ఈ బాధ ఏలా?" అని ఎవరో అడిగినట్లు అడిగి, అమ్మే సమాధానము చెప్పేరు. జాగ్రత్తగా వినండి, ఇది ఆమె వాక్యాలకు మకుటాయమానము: "నేను నేనుగా వుంటూ నువ్వు అయినప్పుడు అనుభవించే వాడు మరొక డనిపిస్తుంది."

'వివరించండి.'

విశ్వమంతా తానే అయినశక్తి - అదే ఆత్మ - నేను. అది మాత్రమే వుండడము తటస్థిస్తే 'నేను' అన్నది మాత్ర మేగా ఉండేదీ? ఆ 'నేను', తన అసలు తత్త్వవ మారకుండా, రూప మాత్రంగా, 'నువ్వు' 'వాడు' 'అది' అనే పరిమితాలుగా అయినప్పుడు, ఆ పరిమిత నేనుల కెవరి

కయినా, కష్టముగాని సుఖముగాని అనుభవించేవాడు అంతా అయిన నేను కాక, ఇంకొక్కడు – పరిమితమైన నేనే – అని అనిపిస్తుంది. అంటే, పరిమితితోవున్న విశ్వ నేనుకి ఏ అనుభవము అయినా, అంతా అయిన నేనుకాక, పరిమిత నేను (అనే ఇంకొకడు) అనుభవిస్తున్నాడనిపిస్తుం దట. సముద్రము నీరుగానే తత్త్వతః వుంటూ, బుడగలుగా అయినప్పుడు, బుడగకు ఒక్కొక్కదానికి, తాను ఇప్పు డున్నూ సముద్రము నీరే అయినా, అక్కడి (చలనము లాంటి) అనుభవము సముద్రానిది కాక, ఇంకొకటి అనిపించే బుడగదే అని అనిపిస్తుంది. ఇంకా సులువుగా చెప్పాలంటే సముద్రము మీద తరంగాలూ అయిసూ ఏర్పడినప్పుడు కదలిక అనే అనుభవము సముద్రానిదే అయినా, తరంగా నీది అయిసుది అని అనిపిస్తుంది. నిజము తెలిసిన వాడికి ఏ అనుభవమైనా విశ్వమంతా అయినవాడిదే అనిపిస్తుంది. కనక వాడికి బాధ అనీ సుఖమనీ వేరైన అనుభవాలు ఉండవు.

'అలాటి వాడికి ఒక్క ఉదాహరణ చూపించండి.'

జిల్లెళ్ళమూడి అమ్మ.

'ఎలాగ చెప్పేరు?'

ఆమె జవాబులవల్లా, పనులవల్లాను. ఎవరు మట్టుకు దేనివల్ల చెపుతారూ?

'మనమూ ఆమెగారి స్థితికి రావచ్చు నంటారా?'

ఆమె వున్నారుగా అలాటివారు ఉండవచ్చు ననడానికి ఆమె నిరూపణయే గదా?

'ఏ సాధన చేస్తే రావచ్చునంటారూ?'

ఏ సాధనకేనా అదే గమ్యము. ఫలాని సాధనకే ఆ స్థితి గమ్యము అవడానికి వీలులేదు. నామదేవుడూ, రామకృష్ణ పరమహంసా, రమణమహర్షీ, తోతాపురి అందరూ ఆస్థితే పొందేరుగా చివరకి?

'అమ్మ కొత్తదారి ఏదో సూచించారని చెప్పేరే మీరూ, ఆ దారి ఈ స్థితికే తీసుకు వెళుతుందా?'

ఆ దారిలో వెళ్ళినవారూ ఈ స్థితికే వెళతారు. ఆ దారిని చూస్తూ అరుగులమీద చతికిలబడ్డవారు మట్టుకు కాదు.

'అదేదో చెప్పండి.'

అంతా అదే అని శ్రవణమూ మననమూ నిధిధ్యానమూ చెయ్యడము.

'శ్రవణము చెయ్యడమంటే ఏం చెయ్యాలి?'

చెయ్యాలి కాదు, ఆ దారిలో సాగేవారు చేస్తారు అని. శ్రవణము అంటే పరిశీలనవల్లా ఆలోచనవల్లా ఈ విశ్వమంతా ఒకే శక్తియొక్క వివిధ రూపాలని అర్థము చేసుకోడము.

'92 మూలపదార్థా లున్నాయి, వెలుతురూ వేడిమీ రేడియో తరంగాలూ, X - కిరణాలూ వంటి తేజో భేదా లున్నాయి, జీవమున్నదీ, ఇంకేమున్నాయో? ఇవన్నీ ఒకటే శక్తి రూపాలా?'

వస్తువూ తేజస్సూ అనేవి ఒకే శక్తికి రెండు రూపాలు గదా?

'అయిన్‌స్టీన్ నిరూపించినదా?'

అవును. యురేనియము కేంద్రకము న్యూట్రాను తాడనమువల్ల ముక్కలైనప్పుడు తేజస్సుగా మారినదీ వస్తువే, నాలుగు హైడ్రొజను పరమాణు కేంద్రకాలు హీలియము కేంద్రకంగా కరిగినప్పుడు తేజస్సుగా మారినవీ వస్తువే. కనక ఏ వస్తువేనా తేజస్సుగా మారగలదూ, పద్ధతులు మనకిప్పటికి తెలియవు. అలాగే తేజస్సు వస్తువుగానూ మారగలదు. గామా కిరణాలు సీసపు పలకలోంచి ఆండర్సన్ పంపితే మారినట్టు.

'అన్నిరకాల తేజస్సులూ మారునా?'

వస్తువు తేజస్సై రాగలదు. అంటే వస్తువూ తేజస్సూ రెండు వేర్వేరు తత్త్వాలు కావు. ఒకటే మూల తత్త్వము ఒప్పుకుంటారా?

'ఆ.'

..................

వస్తువు ఒక విశిష్టమైన అల్లికతో విస్తరించినప్పుడు జీవము కనిపిస్తోంది.

'D. N. A. R. N. A. నా?'

..................

అవును. కనక వస్తువూ జీవమూ మూలంలో వేరు తత్త్వాలు కావు.

'మరణించిన శరీరములోనూ D. N. A. R. N. A. ఉన్నాయి కదా? మరి అక్కడ జీవము లేదే?'

మనకు కావలసిన జీవము లేదు. అయితే గద్దలూ, నక్కలూ, చేవలూ, కాకులూ తిని జీవమును పెంచుకుంటు న్నాయిగదా?

'జీవమును పెంచుకుంటున్నాయా?–శరీరాన్ని పెంచు కుంటున్నాయా?'

టొమాటో విత్తనమును తూచి, దానిని ఒక తొట్టిలో ఉంచి, జీవగుణము లేని రసాయన ఎరువులు వేసి పెంచారనుకోండి. అది వస్తువూ తేజస్సూ మాత్రము గ్రహించి పెరగ

డము లేదూ? మరి అప్పుడు నిర్జీవ రసాయనాలూ తేజః కణములూ జీవపదార్థముగా పెరిగినట్టే కదా? దానిలోంచి జీవములేని పదార్థాన్ని విడతీయగలరా?

'.....................'

ఇక ప్రాణి–అనగా జీవముగల వస్తువు –ఏదేనా పని చేస్తే అది ఆ పనికి సరిపోయే వస్తువుగా మారినట్టే గదా?

'..........  ........'

కనుక వస్తువూ తేజస్సూ జీవమూ మూడూ ఒకే మూలతత్త్వము. ఉండడము మాత్రము విశ్వములో మనకి కనబడే అన్నిగా ఉన్నవి.

'అయితే ఒక చిక్కు వస్తుందండీ గామా కిరణాలు సీసపు పలకలోంచి చొచ్చుచున్నప్పుడు ఎలక్ట్రానులుగా మారేయిగాని X - కిరణాలుగాని మామూలు వెల్తురుగాని అలాగ వస్తువుగా మారవు గదా? ఆ లెక్కని వస్తువూ తేజస్సూ వేడిమిగా మారిపోతున్నాయిగాని, వేడిమిగానీ, తక్కువ బలముగల తేజస్సుగానీ వస్తువుగా మారడము లేదని అనవలసి వస్తుంది.'

వాటంతట అవి మారుతూన్నట్లు ఇప్పటికి మనకు తెలియదు. అయితే వస్తువిరోధివస్తువు (Antimatter) ను కనుక్కున్నట్లే తేజోరూపములనో ఇంకొకరకపు వస్తు నిర్మాణ

కేంద్రాలనో వైజ్ఞానికులు ముందు ముందు కనుక్కోవచ్చును. వాటిల్లో తేజస్సూ వేడిమీ కొన్ని పరిస్థితుల్లో వస్తు కణాలుగా మారుతూండ వచ్చును.

'దేనిని బట్టి అలాటివి ఉండవచ్చు నంటున్నారూ?'

"సామరస్యము (parity) నిలవరించబడుతుంది (Conserved)" అంటున్నారు కదా? ఒకమూల వస్తువు తేజస్సుగానూ వేడిమిగానూ మారిపోతూంటే ఇంకొకమూల తేజస్సూ వేడిమీ వస్తువుగా మారుతూండనూవచ్చుగదా అని. సామరస్యము మాట అటుంచినా, వస్తువూ తేజస్సూకి తోడు జీవము ఒకటి ఉన్నదిగదా? దానిని గురించి మనకి బాగా తెలియదు. సంకల్పానికి వస్తువుని కదిపే, మార్చే, నిర్మించే శక్తి ఉన్నదిగదా?

'అంటే?'

హిస్టీరియా, హిప్నాటిజమూ, ఆధ్యాత్మిక వ్యక్తుల సంకల్పమూ వస్తువుని కదిపీ నిర్మించీ, దానిమీద అధికారము చలాయిస్తున్నవిగదా? కనక సంకల్ప బలమువల్ల విశ్వములో తేజస్సు వస్తువుగా మారుతూనూ ఉండవచ్చును.

'అట్లాంటి సంకల్పము ఉన్నదని ఏమిటి నిర్ధారణా?'

ప్రకృతి సూత్రాలను తీర్చిన సంకల్పము, విశ్వాన్ని నియమానుసారంగా నడుపుతున్న సంకల్పము–మహాశక్తి ది. ఏదో విశ్వసంకల్పం ఉన్నదనే నమ్ముతాను నేను. విశ్వములో పద్ధతి కనిపిస్తుంది అది సంకల్ప ఫలమే అంటున్నాను నేను.

'చెప్పండి. అయిపోయిందా విశ్వవిశ్లేషణ?'

ఇది ఎవరికి వారికి బాగా నమ్మకంగా వారి మనస్సులలో జరగాలి. కనపడేవి వేర్వేరు రూపాలైనా మూల వస్తువు ఒకటేనని అర్థము చేసుకోవాలి. సముద్రంలో కెరటాలూ నురగా, సుడులూ ప్రవాహాలూ, అయిసూ, జల్లూ, నీటిఆవిరీ అనేవి రూపమూ గుణమూలో దేనికది వేర్వేరయినా రసాయనిక తత్త్వములో నీరు ఒకటేకదా? పంచదారతో చేసిన కోటలూ, చిలకలూ, చేపలూ, పన్నీరుబుడ్లూ, రూపమూ- భాగాల గట్టితనమూలో వేర్వేరైనా వస్తుతత్త్వము ఒకటే అయినట్టు.

'తరవాత?'

అంతా ఒకే మూలతత్త్వం అన్న విశ్వాసము కుదరడమే శ్రవణము అన్నదాని ఫలము. చెట్లూ పుట్టలూ రాళ్ళూ రప్పలూ జంతువులూ మనుష్యులూ అంతా ఒకే సద్వస్తువు యొక్క వేర్వేరు రూపాలు.

'సద్వస్తువు మారుతుందంటారా?'

మారని వస్తువే సత్ తక్కినది మిథ్య అనే తత్త్వము కాదు ఇది. మారనిదీ మారేదీ అన్ని చేరిన మొత్తపు వస్తువునే సద్వస్తువు అంటున్నాను. కొవ్వొత్తి కాలిపోతే వస్తునష్టము ఏమిన్నీ అవదు అని నేర్చుకున్నాము కాదూ? అలాగే, జంతువు మరణించినా పుట్టినా, వర్షము కురిసినా కురవక పోయినా, ఉప్పెన వచ్చినా రాకపోయినా. నాశన మయ్యే దేమీ లేదు. "పరిణామమేకాని [illegible]" అన్నారు అమ్మ.

'చెప్పండి శ్రవణమైన తర్వాత?'

# మననము

'శ్రవణము తర్వాత?'

శ్రవణము తర్వాత మననము. శ్రవణమంటే చదవడమూ, వినడమూ, చెప్పడమూ తర్కించడమూ అన్నీని.

'చదవడము అంటే ఏమి చదవాలి?'

అమ్మవాక్యాలు.

'అమ్మవాక్యాలన్నీ చదువుకోవాలా? అంటే ఆ వాక్యాలు చెప్పే సత్యాలన్నీ మనస్సులో పెట్టుకోవాలా?'

అన్నీ చదివితే మనసులో పెట్టుకునేది ఒకటే వాక్యమవుతుంది.

'ఏమిటా వాక్యమూ?'

అంతా అదే అని.

'ఓం తత్సత్ అనా?'

'అదే' అంటే 'ఇది కాని అది' అని కాదు. ఉన్న దేదైతే వున్నదో, అది అంతానూ అని. ఒక్కతేడా చెపితే, మీకు తత్సత్ అనడానికి అంతా అదే అనడానికీ భేదము బోధ పడుతుంది. తత్సత్ అనేవారు జగత్తంతా – జంతువుల శరీరాలూ మనసులూతోపాటు – సత్పదార్థము కాదంటారు.

'అదే ఇవన్నీ అయిందనరూ?'

చెప్పడానికి మాత్రం సముద్రమూ తరంగాలూ ఫేనమూ బుద్బుదాలూ లాగే అని ఒకటి రెండు చోట్ల చెప్పేరూ, బంగారమూ వేర్వేరు నగలూ అని చెప్పేరు కాని 'ఉన్నది బంగారమే, నగల నామమూ రూపమూ అన్నవి నిజాలు కావూ మారిపోతాయి గనకా' అన్నారు. "రూపత్వమూ గుణమూ కూడా ఎప్పుడూ ఉండవే ఇక్కడి ఈ రూపమూ అక్కడి ఆ రూపమూ ఎల్లకాలమూ ఉండక పోవచ్చును కాని రూపత్వము గుణమూ ద్వంద్వాలూ సృష్టి ఎప్పుడూ ఉండేవే అంటారు అమ్మ. రూపమూ అదే, గుణమూ అదే, అదే కానిది లేదంటారు అమ్మ. "శరీరమూ ఆత్మ కాదంటారు కానీ శరీరమూ ఆత్మ కాకపోలేదు" అంటారు అమ్మ.

'ఇదేదో విడ్డూరమే. ఇంతవరకూ ఏ శాస్త్రమూ అన లేదు ఈ మాట.'

చక్కగా చేప్పేరు, కనక అమ్మ చెప్పేది 'తత్సత్' అని కాదు. 'నగల రూపం మారుతుందీ బంగారమే మిగులూ' అన్నీకాదు. బంగారము నగలరూపంలోనూ వుంటుందీ విడిగా బంగారముగానూ వుంటుందీ. మనకు కనబడే విశ్వము ఎప్పుడూ – ఈ రూపముతో కాకపోవచ్చుకాని, ఏదో రూప ముతో – వుండినదే, ముందుముందు ఉండేదే' అంటారు.

'చెప్పండి. అమ్మవాక్యాలన్నీ 'అంతా అదే' అన్నట్టే చెపుతాయి అన్నారే, అది వివరించండి'

"సృష్టికి పూర్వము లేదు" అన్నా రమ్మ. 'భగవంతుడు వేరుగా వుండి జగత్తే లేని శూన్యములో జగత్తును నిర్మిం చాడు' అంటారు పెక్కురు. ఎప్పుడూ వున్నది సృష్టే. సృష్టిలేని కాలముగానీ, ఉండని కాలముగానీ లేనేలేదు; ఉన్నదంతా అదే అంటారు అమ్మ. దానికి ఆదీ అంతమూ లేవు.

'జగత్తు జడము కాదూ?'

చైతన్యాన్ని పెంచే జడఆహారము సంగతి అను కున్నాముకదా? చచ్చిన జంతువుని బ్రతికివున్న జంతువులు తిని పెరుగుతున్నాయి. జడమూ చైతన్యమూ వేరా? రెండూ ఒకదానివే.

అమ్మని ఒకాయన అడిగేరు 'అమ్మా రామకృష్ణపరమ హంస వివేకానందస్వామికి భగవంతుణ్ణి చూపించారట. మీరు నాకు చూపించరాదా'? అని. అమ్మ అన్నారూ, "కనపడేది అంతా అదే అయినప్పుడు ఎటువేపు వేలుపెట్టి చూప మన్నావు?" అని.

'సర్వం ఖల్విదం బ్రహ్మ అనేగా?'

ఆ మాట నేను పదే పదే అంటూవచ్చానూ, వేదాంత (ప్రకరణ) గ్రంథాలు అన్నాయీ, వ్యాఖ్యాతలూ అన్నారు. వారన్నదానికీ నే నన్న దానికీ చాలా తేడా వుంది. నే నన్నది అమ్మ "అంతా అదే రెండోది ఏదీ లేదు" అన్న అర్థమునే అన్నాను. వేదాంతులూ పండితులూ వేరే అర్థము చెప్పేరు, వినండి. వారూ విశ్వ విశ్లేషణ చేశారూ విశ్వమంతా 'అస్తి. భాతీ, ప్రియమూ, నామమూ, రూపమూ' అన్న పంచ అంశలు గుర్తించారు. వీటిలో మొదటి మూడూ బ్రహ్మ రూపమనీ తక్కిన రెండూ జగద్రూపమనీ అన్నారు (సరస్వతీ రహస్యోపనిషత్) (సర్వ వేదాంత సిద్ధాంత సార సంగ్రహము. 871.) ఈ రెండో గ్రంథంలో "సచ్చిదానందనామరూపాణి పంచచ, ఏకీకృతోచ్యతే మూర్ఖైరిదం విశ్వమితి భ్రమాత్" (872) అని అంటూ సచ్చిదానంద నామరూపాల్ని అన్నిటినీ చేర్చి ఒకటిగా ('సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే వాక్యంలోని 'ఇదం'కు అర్థముగా) చెప్పరాదని సూచించారు. అధిష్ఠానము అయిన బ్రహ్మ సచ్చిదానంద లక్షణమటా, దానిపైన నామ

రూపాత్మక జగత్తు అధ్యస్తమట (870) 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే వాక్యానికి పండితులు, ఈ మహా ప్రపంచమే వాచ్యార్థమనీ ప్రపంచాభిమాన రహిత నిర్గుణ చైతన్యమే లక్ష్యార్థమనీ నిర్ణయించారట (446) కనుక 'సర్వం' అన్న మాటకు ప్రపంచమూ దానిలోనూ పైనావున్న చైతన్యమూ కలిసినది అనైనా అర్థం చెప్పరాదట. మీరు 'మొత్తమంతానూ' అంటానూ అంటే నా అభ్యంతరము లేదు కాని వేదాంతులు ఒప్పుకోలేదు అని చెపుతున్నాను.

'తర్వాత చెప్పండి.'

"అన్ని రూపాలూ ఆయనవే, అన్ని సంకల్పాలూ ఆయనవే, అన్ని క్రియలూ ఆయనవే" అన్నారు అమ్మ.

'అంటే బ్రహ్మము రూపము గలవాడూ, సంకల్పము గలవాడూ, క్రియాపరుడూ అనా?'

అన్ని రూపాలూ ఆయనవే, ఒక్క రూపము తనదీ అన్నది లేనివాడు; అన్ని సంకల్పాలూ ఆయనవే, ఒక్క ఈ సంకల్పమే అంటూ లేనివాడు; అన్ని పనులూ ఆయనవే, ఒక్క ఈ పని అంటూ లేదు ఆయనకి. అన్ని అనుభవాలూ ఆయనవే, ఒక్క ఈ అనుభవమంటూ లేదు ఆయనకి. ఉన్న రూపాలన్నీ, కలిగే సంకల్పాలన్నీ జరిగే పనులన్నీ ఆయనవే. అన్నీ ఆయనవే. ఆయనది కానిది లేదు. అన్నిటిలోనూ అంతర్యామిగా ఉన్నాడనీ కాదూ, అన్నీ అయి

నట్టుగా కనిపిస్తున్నాడనీ కాదూ, అన్నీగా తానే అయి వున్నాడనీ.

'ఇందాకా, "ఏది జరిగినా ఎవరు ఏది చేసినా మనం కాదు చేసేది – మనను నడిపించే శక్తి మరొకటి ఉన్న దనుకో" మన్నారు అని చెప్పేరే మీరూ, 'నడిచేవారము మనమూ, నడిపించే శక్తి వేరూ' అన్నట్టు వినపడుతున్నదే ఆ మాటా?'

అన్నిపనులూ తనవే. అయితే మనము మానవులము పరిమిత రూపమూ, పరిమిత సంకల్పమూ, పరిమిత క్రియా శక్తిగలవారము. అనంతము మీది పరిమితులము. కనక మన స్ఫురణా పరిమితమే. 'అంతా అయిన నేను' అన్న అర్థముతో కాదుగా మనము మాట్లాడేది?

'ఎందువల్ల అలాగా?'

పరిమితులతో వున్నాము కనుకా. 'కాళ్ళు నడుస్తు న్నాయి కనక మనమే నడుస్తున్నాము' అనుకుంటాము. 'కాళ్ళూ, కాళ్ళను నడిపించే శక్తి అదే అయిన మనము, పరిమితితో వున్న నేను నడుస్తున్నాను' అనుకుంటాము గాని, అంతా అయిన నేను ఈ శరీరముగా నడుస్తున్నాను' అను కోము. కనుక, 'ఏమిటి మాకు మీ సందేశము?' అని లోక వ్యవహారానుగుణముగా అమ్మను అడిగినవారికి, "మీరు

ఏది చేసినా చేయించేదేదో అంతా అయిన మహాశక్తే అని అనుకోవడమే" అని చెప్పేరు అమ్మ. 'కొన్ని నేను చేస్తున్నాను. కొన్ని ఆ మహాశక్తి చేస్తున్నదీ అని అనుకోడమూ పరిమితులతో వున్న మానవత్వ లక్షణమే. అలాటి వారికి అమ్మ 'అంతా చేసేది అదే' అని చెపుతారు. ఉన్నచోటు నుంచి ఒక మెట్టెక్కించడమే 'అన్నీ అదే చేయిస్తోంది' అని చెప్పడము.

'చెప్పండి అమ్మ వాక్యాలన్నీ 'అంతా అదే' అనే వేలు చూపిస్తాయి అన్నారే, అది చెప్పండి.'

'చచ్చిపోయినవారు ఎక్కడ పుడతారమ్మా' అని ఒకామె అడిగితే అమ్మ "మళ్ళీ పుడతారని ఏముందీ?" అన్నారు.

'అంటే మరి పుట్టరనే కదా?'

ఆ మాట ఎక్కడ ఉందీ? ఎక్కడ పుడతారూ, అని అడిగితే అంత నిశ్చయంగా 'పుడతారని ఎలాగ అనడమూ?' అన్నట్టు జవాబిచ్చారూ. అంతా అదే అయినప్పుడు పుట్టుకా జీవితమూ దాని సంకల్పంతోనే నిశ్చయమై పోయాయీ, ఆ నిశ్చయము ప్రకారమే జరిగిపోతాయీ. ఈ జీవి బ్రతుకు ముగిసిపోతే తరవాత మళ్ళీ ఈ జీవితాన్నే ఆమ్రేడితము చెయ్యవలసిన అవసర మేమిటీ? కనక "మళ్ళీ పుడతారని ఏముందీ?" అన్నారు.

'ఈ పుట్టుక ఇచ్చిన సంకల్పమే వది పుట్టువులు ఇవ్వ లేదంటారా?' ఇవ్వవచ్చు. 'ఇవ్వవలెను' అని ఏం లేదు అయితే మొదటి పుట్టువునుబట్టి రెండోది కాదు. మొదటి రెండూనిబట్టి మూడోది కాదు, దేనికదే. పుట్టువులు ఎవరూ తెచ్చుకున్నవి కావు, అది ఇచ్చినవే.

'ప్రారబ్దమని'—

మొదటి జన్మలో ప్రారబ్ధము ఎవరిచ్చారూ?

'పుట్టుకను ఇచ్చినవాడు.'

ఇంకేం? ప్రారబ్ధం మనది కాదు. మన్నిచేసిన భగ వంతు డిచ్చినదే. అందుకే అమ్మ 'ప్రారబ్ధం భగవంతుడు' అన్నారు. పుట్టుకా ప్రారబ్ధమూ మట్టుకే కాదు. ఏదైనా నిర్ణయాన్నిబట్టి జరగవలసినదే .సాధనకూడానూ. జరిగినది గుర్తుంచుకుని 'సాధన చేశామూ' 'వారు చేశారూ' అనవలసి నదే కాని 'చేస్తాము' అనడానికి ఆస్కారము లేదు. చెయ్య డానికి ప్రేరణ ఎవ రివ్వాలి? ఆ ప్రేరణ లేనిదే ఎవరు చెయ్య గలరూ సాధనగానీ ఏదైనాగానీ? అది వున్నప్పుడు ఎవరు తప్పించుకోగలరూ? కనక "సాధ్యమైనదే సాధన" కానీ సాధన చేస్తే సాధ్యము కాదు.

'గురువు అవసరము లేదన్నది'—

గురువు అవసరము లేదని కాదు అమ్మ అనేది, "గురువే అవసరము లేదు" అని. అసలు గురువు భగవం

తుడే. భగవంతుడు ఆ బుద్ధి కలిగిస్తేనే ఎవడికేనా కలిగేది. వేమన్నకి ఎవరు కలిగించారు? త్యాగరాజుకి ఎవరు కలిగించారు? త్యాగరాజుకి ఎవరు కలిగించారు? కన్నప్పకి గురు వెవరు? ఎవరినో మానవుణ్ణి 'గురువు' అని చేరితే భగవంతుడి గుర్తు తెలుస్తుందా? ఆ గురువుకి తెలిస్తే కదా మరొకరికి చూపడానికి?

'మొత్తానికి వాక్యాలన్నీ—'

"అంతా అదే" అన్న వాక్యము నుంచి పితికినవే. ఇంకెవరేనా రెండు చెప్పవచ్చును కాని అమ్మ ఒకటే చెప్తారు.

'కొంచెము వివరించండి.'

'నీ యత్నము నువ్వు చెయ్యకపోతే 'భగవంతుడి సాయము ఏం చేస్తుంది' అన్నట్టు చెప్తారు అందరూ. అమ్మ "పురుషకారమూ దైవసహాయమూ ఒక్కదానివే" అని చెప్తారు. 'పురుషకారానికి ప్రేరణా, తరవాత సహాయమూ అన్నీ చేసేదీ అదే' అనీ.

'మరి మనము?'

దాని రూపాలలోనిది కాని శరీరమూ, దాని ప్రేరణ లేని యత్నమూ, అది తీర్చని కార్యమూ లేవు. ఉన్నది అదే, దానికి మనము వేరుగా లేము, అంతా అదే,

'అమ్మ వాక్యాల్ని అధ్యాయాలుగా విభజించారేమి?'

'అంతా అదే' అన్న వాక్యము యొక్క వివిధ ముఖాలనీ. ఏ అధ్యాయమైనా ఆ వాక్యానికి ఒక పార్శ్వమే. అన్ని అటే జరుపుతాయి ఆలోచనని.

'అమ్మవాక్యాలు చదివి మననము చేసుకోడము తర్వాత ఏం చెయ్యాలి?'

చెయ్యాలి కాదు. ఈ కొత్తదారిలో సాగేవాడు చేసుకోవచ్చును.

'తరవాత ఏమిటది?'

నిదిధ్యాసము

'వివరించండి'.

# నిదిధ్యాసము

అమ్మగారింటిలో ఒకప్పుడు తద్దినము పెట్టుతూండి నారు. పురోహితుడు "అన్నం బ్రహ్మ" అన్నాడు. అమ్మ, "శాస్త్రిలుగారూ అశుద్ధమో?" అన్నారు. వేరొకసారి, "ప్రజ్ఞానం బ్రహ్మయితే అజ్ఞానమో?" అన్నారు. 'సుగంధాలు నీకోసమే నమ్మా' అంటే "అయితే దుర్గంధమో?" అన్నారు. "గొప్పపని చేసినా చిన్నపని చేసినా ప్రేరణ వాడిదే కనక నీ గొప్పా తక్కువా ఏమీ లేదు," అన్నారు.

ఇదిగో ఈ తత్త్వము జీర్ణిస్తుంది నిదిధ్యాసముతో.

మనకు రాగద్వేషములూ ఇష్టానిష్టాలూ సంతోష దుఃఖాలూ సామాన్యము. ద్వంద్వాల్లో ఏదైనా మన గమనికకి తగులుతుంది. దాన్ని మెచ్చుకోడమో ఏవగించు కోడమో చేస్తాము. చల్లని గాలి వేస్తుంది. హాయిగా

వుంటుంది. "చల్లగాలి సర్వమూ తానే అయిన అమ్మ రూపమే. ఎంత మంచిది అమ్మ! వేడిగాలీ, ఎగరవేసే సుడిగాలీ, ముక్కులు మూయించే మురికికాలవగాలీ, మన ముక్కులో ఆడే గాలీ సర్వమూ అయిన అమ్మ రూపాలే. అన్ని గాలులూ అమ్మే" అనుకోడము నిదిధ్యాసనము.

ఆకాశంలో కొంగలవరస ఎగురుతూ పోతూంటుంది. కాళిదాసు కాలంనించీ ఆ సౌందర్యాన్ని గుర్తించి ఆనందించారు సామాన్యులే కాక కవులునూ. 'ఎంత బాగుందో' అన్న భావము వస్తుంది దాన్ని చూస్తే. కిర్ కిర్ మంటూ రామ చిలుకలు ఒక దానివెనుక ఒకటి బాణాల్లాగ దూసుకుపోయినా, కుర్ కుర్ కుర్ కుర్ అని కోయిల ఒక్కటే కనుచూపును దాటినా, నీరనీ నిశీథములో 'తీ' 'తీ' అంటూ ఎక్కడో తీతువు కూసినా మన గుండెలకు తగుల్తాయి ఆ శబ్దాలన్నీ. శబ్దాలన్నీ ఆత్మ శబ్దాలే. ఘుమఘుమారావ సంకుల ఘోర జీమూత పటలమునుంచి పిడుగుతో వచ్చినా, మట్ట మధ్యాహ్నపు ఎండలో ఏ చెట్టుకొమ్మనుంచో కంసాలిపిట్టనుంచి వచ్చినా, బర్రుమని ఆనకట్ట కిందనుంచి విసురుకు వచ్చే నీటినుంచి వచ్చినా, అధికారి తిట్లతో వచ్చినా, పాలబుగ్గల పసిపాప నవ్వునుంచి వచ్చినా, శబ్దము-అటు ఓంకారం నుంచి కప్పల బెకబెకలదాకా - గాలిలో సంచలనమే; శక్తి నుంచి వచ్చేదే, అంతా దానిదే, అదే.

రాత్రివేళ కొండమీదనుంచి నగరమంతా విలోకిస్తే దీపాలు దీపాలు దీపాలు. తెల్లవీ, లేత ఆకుపచ్చవీ, నీలానివీ,

ఎర్రటివీని. కొన్ని చెరువులో వెల్తురుగీట్లులాగ చలిస్తాయి. ఆకాశంలో ఏరోడ్రోమునుంచి మాటిమాటికీ వెలుగుదారి ఇట్నుంచి అటు విసురుతుంది. అట్నుంచి ఒక మూలా ఇట్నుంచి ఒక మూలా మోటారుకారు ముందులైటు అలా చూసి పక్కకి తిరిగిపోతుంది. పైకి చూస్తే నల్లని ఆకాశము నిండా మినుకు మినుకు మని నక్షత్రాలు. కష్టపడుతూ ఎత్తు ఎక్కే సైకిలు మెల్లకన్ను చూడబోయి మానేస్తుంది. అదుగో ఆ స్వాతి నక్షత్రంనుంచీ ఆ చిత్తనుంచీ, ధ్రువుణ్ణించీ ఈ లైట్లన్నింటినుంచీ ఆ నీటినుంచీ వచ్చేదంతా వెలుతురే. సెకనుకి నూట ఎనభయ్యారు వేల మైళ్ళ వేగంతో పరుగెత్తేదే. ఆ తాత చుట్ట ముట్టించుకోడానికి వెలిగించే అగ్గిపుల్ల వెల్తురూ, జిగ్గు జిగ్గు మనే మిణుగురు వెలుగూ అదే, ఆ తేజస్సే. ఇవన్నీ అదే. ఆ శక్తే.

ఇలాగ ఏ విషయము గట్టిగా తగిలినా దాని సౌష్టవమూ (symmetry) దాని కుటుంబములోని పెద్దా చిన్నా మేళనమూ (harmony) తణువుకుని 'అదీ ఇదీ అంతా అదే' అనే సత్యాన్ని నెమరువేసుకుంటూ వుంటే ఈ ఆలోచనల నడిమి కాలము పొట్టి పొట్టి అవుతుంది. నామస్మరణ ఎప్పుడూ చెయ్యండి అని చెప్తారు నామభజనపరులు. సాయంకాలము రోడ్డు పక్కన పేవ్‌మెంటుమీద పోతూ మొదలుపెట్టాము. కొన్ని సెకనులు చేసిన తర్వాత పక్కనుంచి ఒక బస్సు పోతుంది. పట్టుకు వేళ్ళాడుతూంటారు కాలేజీ పిల్లలు. ఇంకో ఆలోచన వస్తుందీ సాగుతుంది. నామము చెయ్యడము

మరుగున పడుతుంది. ఏ ఆంజనేయస్వామి కోవెలో వస్తుంది. నామము మళ్ళీ జ్ఞాపకము వస్తుందీ మళ్ళీ ఆరంభిస్తాము. ఇలాగ చేస్తూ అనుకోకుండా మానుతూ మళ్ళీ చేస్తూ అలాగ రోజూ చేస్తే క్రమ క్రమంగా రెండు మార్లు నామంచేసే కాలాలు దగ్గర దగ్గరకు వస్తాయి. చివరికి నామం నిరంతరాయమూ అలవాటూ అవుతుంది. చేసే పనుల వెనుక అదే తెరలాగ నిలుస్తుంది. ఇదే ప్రకారంగా అంతా అమ్మే' (అంటే సర్వమూలోదే) అన్న సత్యమునూ ఉదాహరణ పూర్వకముగా విస్తరిస్తూ మననము (ఇదే నిదిధ్యాసము) చేస్తూంటే, తానుకూడా సర్వమూలోని వాడనే కాని 'నేను' అంటూ వేరుగా, చిన్నగా లేనని తెలుస్తుంది సాధకుడికి. అంటే సర్వమూతో తాదాత్మ్యము కలుగుతుంది.

అంతా అదే అని గుర్తిస్తున్నవాడికి ద్వంద్వాలలో వాటిలో వాటికి వ్యతిరేకత కనిపించక వాటి పొడుగూ పొట్టీ తేడాలే కనిపిస్తాయి.

అన్నీ అది కల్పించినవే కదా అనిపిస్తాయి. దేనికీ తోడి మానవులు కర్తలు కారనిపిస్తుంది. కనక ఏ లోపం జరిగినా దానికి వారెవరూ బాధ్యులు కారనిపిస్తుంది. దేనికీ వారు కర్తలు కానప్పుడు వాళ్ళననేదేముంది? అనిపిస్తుంది. ఏం జరిగినా నవ్వుతూ అనుభవిస్తాడు. ఇది అవస్థ అన్న

చింత అలాటివారి కుండదు. అదృష్ట దురదృష్టాలు రెండూ భావనలే అని వారికి తెలుసు. కనక వారి ఓర్పు సహజమైన ఓర్పవుతుంది. దెబ్బలు ఎవరి పొరపాటువల్ల తగిలినా 'ఆ యోగ్యత వుండి తగిలింది' అనుకుంటారు. వాళ్ళకి తుడిచేటప్పుడు వాకిలీ, మతిభ్రమచెందిన కుర్రవాడి చొంగా, కుష్టురోగి కాలూ ఒకటే. పోసుకునే టప్పుడు వేడినీళ్ళూ చన్నీళ్ళూ ఒకటే. వారింట ఎవరేనా తినివెళ్ళితే 'వారి అన్నం ఇక్కడ వున్నది' అనుకుంటారూ, తినకుండా వెళ్ళిపోతే 'వారి అన్నం ఇక్కడ లేదు' అనుకుంటారు. కాని తాము పెట్టలేదను కోరు. వారిని ఎవరూ సుఖపెట్టనూ లేరూ, కష్టపెట్టనూ లేరు.

'ఈ స్థితి వస్తుందంటారు 'అంతా అదే' అన్న వాక్యార్థం శ్రవణ మనన నిదిధ్యాసలు చేస్తే.'

చేస్తే కాదు, అవి సరిగ్గా జరిగితే.

'శ్రవణమూ మననమూ నిదిధ్యాసనూ అంటున్నారుగా? మరి ఈ దారి విశేషమైనదని ఎందు కంటున్నారూ?'

ఇది సంప్రదాయము చెప్పిన వివిక్త బ్రహ్మనూ నిర్వికల్ప సమాధినీ స్పృశించకుండా నేరుగా సహజ సమాధికి — సర్వకాల సర్వావస్థలలోనూ సమానస్థితికి—తీసుకు వెళ్ళే దగ్గర దారి కనక.

'ఎవర్నేనా తీసుకువెళ్ళిందా? లేక తీసుకు పోగలదు అనా?'

రెండూను.

'అంటే మీరు నమ్మేరు అనీ, ఎవరో ఈ దారిలో సహజ సమాధికి చేరేరు అనా?'

నేనే కాదు, భారతదేశము ఉత్తరఖండములోని ఒక ఆశ్రమ కార్యదర్శి అయిన సన్యాసి, ఈ అలోచనను తాను బోధిస్తూండని జ్ఞాని, "దీనికి అక్షేపణ ఏమీ? ఇది అత్యుత్తమమూ (excellent), అద్భుతమూ (wonderful) ను" అన్నారు. అమ్మ భక్తులలో అగ్రగణ్యులు 'కార్ల్ గార్డెన్ వెస్టర్ లండ్' అన్న అమెరికను యువకుడు ఈ దారిలో ఇంచుమించు గమ్యము వరకూ పయనించాడు.

'ఎలాగ చెప్పేరూ?'

ఆయన ఉత్తరాలు - వేయి కాగితాలు దాటినవి-లో ఆయన రాసే ఊహలూ భావాలూ బట్టి. ఆయన ఇప్పుడు ముప్పది అయిదేండ్ల వాడు. అనుష్ఠాన క్రైస్తవుడు. పంద్రెండేండ్ల పాటు బైబిలు పాఠాలు చెప్పేడూ, బైబిలు బోధనల కరపత్రాలు విదేశ నౌకలలో పంచిపెట్టేడు. ఆయన ఒక భారతీయ నౌకలో గుజరాతీ నావికుల గోష్ఠిలో విని, గీత భాగవతము, భజగోవిందమూ వంటి గ్రంథాలు తెప్పించుకుని అధ్యయనము చేశాడు. భారతదేశములోని ఆధ్యాత్మిక కేంద్రముల నుంచి అందరి గ్రంథాలూ తెప్పించుకుని చదివేడు. "అన్ని క్రియలకూ ప్రేరణ అది ఒకటే" అన్న అమ్మ వాక్యమూ

'అంతా అదే' అన్న అమ్మవాక్యమూ ఆయనకు గట్టిగా తాకినవి. అంతా ఒకటే అయిన దానిని గురించి అమ్మ వాక్యాలవల్ల తాను నేర్చుకున్నది 'దేవుని కుమారుడైన క్రీస్తు నుంచి నేర్చుకున్నదానికంటె ఎక్కువ' అని రాస్తున్నా డీయన.

ఈనాడు గార్డను, భగవంతుణ్ణి పిట్టల ఆకలి కూతల లోనూ, తన దారికి అడ్డముగా పరుగెత్తే చిట్టెలుకలోనూ, తన్ను నవ్వుముఖముతో పలకరించే నైట్‌వాచ్‌మన్‌లోనూ ప్రశ్నించే స్నేహితులలోనూ, వందల వాతాయనములలో నుంచి చూచే సౌధ దీపములలోనూ, ముఖాన్ని బాదే రొజ్జగాలిలోనూ, తనరొట్టెమీద వాలే ఈగలోనూ, నిశ్చల స్తబ్దతతో తనవైపు చూచే ఆర్కిటిక్ దృశ్యములోనూ గుర్తి స్తాడు. అది కానిదే లేదంటాడు. "అన్ని రూపాలూ ఆమె రూపాలే, అన్ని మార్గాలూ ఆయన మార్గాలే; ఆమెయే అతడూ. ఆతడే ఆమె. ఒకటే అన్ని పాత్రలూ నిర్మించి నటించేది" అంటాడు. "తల్లీ కూతురూ, తండ్రీ కొడుకూ, అన్నా తమ్ముడూ, బాటసారీ దారితోడూ, ఒకదాని రెండు రూపాలు, అదే అన్నీ అయి ఉన్నది"ట రూపాలన్నిటికీ "రూపమూ, కల్పము లన్నిటికీ సంకల్పమూ, క్రియలన్ని టికీ ప్రేరణా, అన్ని కార్యములకూ కర్తా అమ్మయే. మన కందరకూ అది ఒకటే. కనబడని దానినుంచి మన ముద్భ విస్తామూ, కనబడని దానిలోకి వెళ్ళిపోతాము; కనబడేదీ కనబడనిదీ అమ్మే. అన్నీ అదే; కొండలూ బండలూ,

సిమెంటూ ఇనుమూ సముద్రమూ ఆకాశమూ, గాజూ వైజ్ఞానికులూ సహా'నట! ప్రాణము అంతా అతని ప్రాణమే. ప్రతీ మరణమూ అతని మరణమే. అయినా అదీ ఇదీ ఆయనను స్పృశించదు. ఒకటీ అన్నీ అయి వుంది. ప్రాణమూ మరణమూ, సంతోషమూ దుఃఖమూ బాధా మోదమూ, సత్యమూ అసత్యమూ, రూపమూ అరూపమూ, అన్నీ. అన్నీ అదే - నంటాడు. "దేవాలయమే లేదు; ఉన్నది దేవుడే"నట.

'బాగుంది.'

"గొంతులూ రూపాలూ వేరుగా కనిపిస్తాయి.
కానీ మాట్లాడేది మాత్రము ఒకటే
అదే రూపాల్నీ ఏర్పరుచుకునేది
తత్త్వమసి తత్త్వమసి తత్త్వమసి సఖుడా" అన్నాడు.

ఉన్నదొకటే, ఏకాకి 'నేను.'
అదే అదే అమ్మంటే.
అదే వుంది పెద్దా చిన్నగా
అన్ని నేనులూ ఆ నేను నుంచే
అందరు అమ్మలూ ఆ అమ్మనుంచే అన్నాడు.

'తనకు ఏం కావాలంటాడూ?'
ప్రభూ, నాకు స్వర్గము వద్దు స్వామీ
నన్ను నీలో లయించిపోనీ
'నేను' అన్నదే వద్దు నాకు. అంటాడూ,

అహంకారము లేని ఏకమా
నా అహం తెంపేయి,
అంతా ఉన్న అంతా అయిన
నీలోకి ఉన్న అంతా అయిన
నీలోకి దాన్ని విస్తరించనీ అన్నాడు.

'ఉన్నదా 'నేను' అనుకునేది?'
"ఓ. ఉంది. అంతా అయిన అదే" ట!

ప్రతీ కన్నూ ఆయనదే
ప్రతీ చెవీ ఆయనదే
ప్రతీ శబ్దమూ నిశ్శబ్దమూనూ
అతడు కానిది కలదా? ఏది? అని అడుగుతాడు.

ప్రభూ! అన్ని రూపాలూ నీ నుండే వస్తాయనీ
నీలోకే పోతాయనీ అవి నీ రూపాలే అనీ,
దారుణమైనవి పామూ దయ్యమూ హంతకుడూ,
నుంచి

ఉత్తమ ఉన్నత ఉదారునివరకూ
నీవే నీవే నీవే నని
ఎప్పుడూ నే ననుకోవాలి స్వామీ! అంటాడు.

'చిత్రముగా వుంది'.

అమ్మ నెరిగిన తర్వాత నా బ్రతుకు మారిపోయింద న్నాడు. 'జిల్లెళ్ళమూడి ఎప్పుడు వస్తావయ్యా అని రాస్తే,

"ఎందుకనీ? అమ్మ ఇక్కడ లేకపోతేగదూ?" అని రాశాడు. రాజయోగము ఏమీ తెలియదు, సత్కర్మయోగమూ జ్ఞానమూ తప్ప. సమాధి అన్న పదమే ప్రయోగించడు! ఇది సాధనేనా?

'కాదని ఎవ రనగలరు?'

ఒక మెట్టో మెట్టున్నరో వున్నాడు మహానుభావుడు సహజ సమాధికి. నిండా నలభై ఏళ్ళు లేవు.

అతను సాగేది అమ్మ సూచించిన కొత్తదారిలో. ఇంకా కొందరు జిల్లెళ్ళమూడి వెళ్ళుతూవున్నవారిలో ఉండవచ్చు. మ కు తెలిసేదాకా చెప్పలేము.

ఇది అమ్మ సూచించిన దారియా?

'ఈ దారి అమ్మే సూచించారని ఎందుకంటున్నారూ?'

చక్కని ప్రశ్న. "ఇదీ! నేను చేప్పే దారి" అని అమ్మ అనలేదు. అయితే ఆమెగారి వాక్యాలూ జవాబులూ చదివితే, వేలుపెట్టి చూపించకుండా, చెప్పకుండా, ఈ దారిని అనుక్షణమూ సూచిస్తున్నారని నాకు నిర్ధారణ అయింది. కారణాలు చెప్తాను వినండి.

'సహజ సహనము' అన్న పదము నేను అమ్మదగ్గర నుంచే విన్నాను. మరొకచోట ఎక్కడా ఆ మాట వినలేదూ, చదవలేదూ. "నాకు నేర్పుగల ఓర్పు అక్కర్లా. సహజమైన

ఓర్పే కావాలి" అన్నారు (480) అమ్మ ఎప్పుడో ఒకమారు. లాభమో నష్టమో జరిగితే దానివల్ల పొంగకపోడమూ కుంగక పోడమూ కాదు, ఎప్పుడున్నూ క్రుంగు పొంగులు లేకుండా ఉండడము సహజసహనము. 'మీ రే మంత్రం జపించా రమ్మా?' అని అడిగితే "సరే మంత్రము" అన్నారు. 'దేనికి సరే?' "అన్నిటికీ సరే" అన్నారు. వారి గార్హస్త్య జీవితంలో వారిది అన్నిటికీ సరే అనే తత్త్వమే. "తగిలే దెబ్బలు ఎక్కడన్నా తగుల్తాయి. ఇందులో ఒకరు చేసే దేముందీ?" అనే సహనము. ఇదీ సహజ సహనమే. మహోదధిలో తరంగాలు మొదటి భాగము 80, 81 పుటలలో భూమిని సహన దేవత అన్నారు అమ్మ. 'దున్నినా తన్నినా సహించి,....నిశ్చలంగా ....సర్వజీవులకూ ఆహారం ఇచ్చి పోషిస్తున్నావు' అని భూమినే పూజించవలసిన మాతృమూర్తిగా చూపించారు. కనక సహజ సహన తత్త్వాన్ని అమ్మ మహోన్నత స్థితిగా గణించారన్నదీ, తరవాత కనవరిచారన్నదీ నిశ్చయము.

వారు తమను చూడవచ్చిన వారికి కూడా ఈ తత్త్వాన్ని బోధచేశారు. "నువ్వు నేనేదో యిస్తే ఒడి పట్టడం కాదు, ఏది ఇచ్చినా ఒడి పట్టాలి" అన్నారు. మొదటిది ప్రసాదమో సుఖమో; లాభదాయకము. రెండోది ఇష్టములేని దేదైనానూ, 'ఏది ఇచ్చినా ఒడి పట్టి స్వీకరించాలి' అన్నారు. "మనం తొక్కి విడిచి వెళ్ళినా మన పాదాలకోసం ఎదురు చూస్తాయి పాదరక్షలు" అని సహజ సహనాన్ని చూపించారు. దగ్గరున్న వారు వారినో వీరినో తప్పు ఎంచి విమర్శిస్తే వీరు

చేస్తూండే ఇంకా తప్పు ఉటంకించి సహనము నేర్పేరు. కుల భేదం సహిస్తానన్న వారికి గుణభేదమూ సహించాలని బోధించారు. (అమ్మ–అమ్మవాక్యాలూ 1వ భాగము. 165వ వాక్యము) దేనినైనా పొగడితే దానికన్నా గొప్పదానినో, దానికంటే వేరైన గుణం కలదానినో చెప్పి పొగడ్తకు కారణమైన ప్రత్యేకతను కరిగించేస్తారు. (386వ వాక్యము) న్యూనతకి వ్యతిరేకరూపం కదా ఘనత? సహజ సహనానికి అదీ లేదూ ఇదీ లేదూ. సర్వమూ సామాన్యమైతే సర్వసామాన్యము (984) 'మీ దయ ఉంటే ఈ ఒడుదుడుకు లుండవు' అని ఒక రంటే, "నా దయ వున్నా ఒడుదుడుకు లుంటయ్, నా దయ ఒడుదుడుకులే నాన్నా" అని చెప్పి దయకూ ఒడుదుడుకులకూ రెండింటిని స్వీకరించటానికీ సన్నద్ధము చేస్తారు (530). "అయినపనీ కానిపనీ ఆశీర్వచనమే" నన్నారు (684). సర్వకాల సర్వావస్థల యందూ సహజ మయిన సహనమే సమాధి" (987) అన్నారు కనక అమ్మది సహజ సహనము. అదీ చెప్పేరు ఇతరులకి.

ఈ రీతి సహజ సహనము-ఇదే సహజ సమాధి అన్నారు రమణమహర్షి-అలవడడానికని అమ్మ అందించిన ప్రాపు "అంతా అదే" అన్న పరమ సత్యము. ఉన్నదంతా, రూపాలూ సంకల్పాలూ క్రియలూ అన్నీ అదే, దాని వేనని. కన్హాన్‌గాడ్ రామదాసస్వామి – నామ జపము చేసి తరించిన

వారు–భగవంతుడు మనకు బయటా లోపలా కూడా వున్నా డని అనుక్షణమూ మననము చెయ్యమన్నారు. అలాగ చేస్తే దేవుని మీద కోపము పడలేము కనక క్రోధాది గుణాలు పోతాయనీ అహంకారముకూడా భగవంతుడు నిండిన మన అంతర్యములో స్థానము లేక మాయమౌతుందనీ చివరకు వాసుదేవస్సర్వమితి అన్న సత్యము అనుభూతమౌతుందనీ అన్నారు. అమ్మ, అన్ని రూపాలూ సంకల్పాలూ క్రియలూ, చివరకు అన్ని భావాలూ అనుభవాలుకూడా దానివే నన్నారు. రామదాసస్వామి పరమేశ్వరుని అంతర్యామిత్వముద్వారా సర్వరూపత్వమూ, తర్వాత సర్వత్వమూ తెలిసివస్తుంది అని అంటే, అమ్మ భగవంతుని సర్వత్వమునే నేరుగా మన తలకెత్తుతున్నారు. "నేను నేనుగా వుంటూ నువ్వు (న్నూ, అదీ వాడూ వగైరా) అయినప్పుడు (లోకంలోని అనుభవా ల్నన్నిటినీ) అనుభవించేవాడు (అన్నీ అయినవాడేకాక, నువ్వూ అదీ నేనూగా వున్న) ఇంకొకడనిపిస్తుంది" అన్న వాక్యంలో అనుభవించేవాడూ భగవంతుడేనని ముక్త కంఠంగా చెప్పేరు. అన్నీ వాడే, అనుభవించేవాడూ వాడే నన్నది సర్వత్వ పరాకాష్ట. రమణమహర్షి 'నేను' అన్న ఊహకు ఆధారమేమిటో వెతకమని చెప్పేవారు. సహజమైన విశ్వములో విశేషము అయిన ఆత్మను చైతన్యమును–విడ దీసుకునే ప్రయత్నమది. అది జరిగితే ఆ విశేషమే సహజ ముగా ఉన్నదని తప్పక తెలుస్తుందని వారి విశ్వాసము. కాని నిర్వికల్పమును పొందినవారికి అందరికీ – మహర్షికి

తప్ప 'కొందరికైనా – సహజస్థితి వచ్చినట్లు లేదు. అమ్మ సుగంధమూ దుర్గంధమూ (572) ఉత్తమమూ అల్పమూ (918), ప్రజ్ఞానమూ అజ్ఞానమూ (919), అన్నమూ అశుద్ధమూ (920), తానూ తన్ను చూడవచ్చినవారూ (878) కష్టమూ సుఖమూ (684) సిరీ దారిద్ర్యమూ (682) పుట్టించేదీ గిట్టించేదీ (999) అన్నీ అదే అని చెపుతూ సహజస్థితి డోసులే ఇచ్చారు ఎప్పుడూ.

అమ్మ నిర్వికల్పసమాధి మాట తానై ఎప్పుడూ ఎత్తలేదు. ఎవరేనా అంటే వారితో రెండు మాటలు అనేవారు. అమ్మ శబ్దరాశిలో 'నిర్వికల్పసమాధి' లేదు. దాని మధ్యవర్తిత్వమును– ఆచార్యశంకరులూ, కఠోపనిషత్తూ శ్వేతాశ్వతరమూ పతంజలీ రమణమహర్షివలె – అమ్మ చెప్పనే లేదు. నేరుగా సహజ సహనాన్ని గురించే అమ్మ చెప్పేరు. కనక అంతా అదే అన్న సత్యాన్నే ఇంజక్షనుచేసి ఆ తత్త్వాన్నే అందరిలోనూ వ్యాపింపజేసి అంతా దానినిగానే చేసే యత్నము అమ్మదే అన్నాను.

తాను లోపలా వెలుపలా ఒకటే చూచారు (537). నా ధ్యేయమూర్తి ఎక్కడో వున్న ఎవరో కాదు, మీరే అన్నారు (566). నేను మీలో దైవత్వం చూస్తానన్నారు (499). మీరు కావాలనుకోవటమే నా పూజ అన్నారు (503). మీరుకానిది నేను ఏమీ కాదు అన్నారు (195). మీరంతా నేనే. మీదంతా నేనే. ఇదంతా నేనే (49) అన్నారు. ఉన్న అంతాతో ఆమెకు తాదాత్మ్యం. తాను ఆ తాదాత్మ్యంతోనే ఉన్నారూ

మాట్లాడేరూ పని చేశారు. ఈ త్రికరణశుద్ధే ఆమెకు అవతార మన్న కీర్తి తెచ్చింది.

ఆమెగారి వాక్యాలు అన్నీ 'అంతా అదే' అన్న సముద్రానికి చేరే చేర్చే స్రవంతులే. వాచ్యంగా అటు చూపిన వాక్యాలు సరే. సంప్రదాయానికి వ్యతిరేకంగా కనపడ్డా సరే, ఆ మహాసముద్రపు నీటినే ఎత్తుకు వస్తాయే కొన్ని వాక్యాలూ, అవి నిలబడతాయి. అమ్మ సూచించే ఈ కొత్తదారిలో స్త్రతములవలె "సర్వత్రా అనురాగమే విరాగము"ట (516). 'అది' ఎక్కడిదో ఏదో అయినప్పుడు ఇదంతా వదిలేయాలని వైరాగ్యము పెంచు కున్నారు పూర్వులు. 'అది ఇవంతానూ' అయితే సర్వత్రానురాగమే కర్తవ్యమూ సాధనానూ కదా? అంతా అదే అయినప్పుడు పుట్టుకతో వచ్చే నేర్పులూ, ఎక్కడనుండి వస్తాయో తెలీని ఆలోచనలూ తరుణాలూ, విధి ప్రేరణా, ప్రారబ్ధమూ అది ఇచ్చినవే. దానివే (607, 611, 616, 620, 631, 638). దానికి ముందుది ఏదీ లేదు కనక ఈ సృష్టికి పూర్వమంటూ లేదు (657). ఏది జరిగితే అది దాని కర్తృత్వం వల్లనే కనక 'అనుగ్రహ మన్నది ఎప్పుడూ వుంది (631). మన "పనులవటమూ అనుగ్రహమే; అవక పోవటమూ అనుగ్రహమే". మనది "పరిమిత మమకారము" కనక, పనులనుకూలమైతేనే అనుగ్రహ మున్నదను కుంటాము. అంతా అదే చేయిస్తూన్నప్పుడు ఇంక ప్రత్యే కించి సాధకు లెవరూ? (70?). అంతా అది చేయించేది చేసేవాళ్ళే. మరి సాధన అని దేనిని అనాలి? "సాధ్యమయి

నదే సాధన" (714). ఆలోచనలు పంపేది అదే అయిన ప్పుడు మనస్సే దైవం (791). జీవనమూ జీవితమూ అది ఇచ్చినవే అయినప్పుడు ప్రారబ్ధం భగవంతుడు ఇచ్చినదే కాని ని వెప్పుడో ఏదో చేసి తెచ్చుకున్న దెలా గౌతుంది? అదే కాక నీ వొకడవా చేయగలవాడవు? జన్మలున్నా యంటావే, మొదటి జన్మ ఇవ్వడానికి కారణం లేదుగా? ఏ జన్మ యివ్వ డానికి మట్టుకు కారణం ఏముంటుందీ, జన్మకు కారణం అకారణం (822). తానిచ్చిన బ్రతుకు బ్రతికి, తన నిర్ణయం ప్రకారం జీవితావసానము చేరిన జీవిని అంతా అయిన అంఆ తనలో కలుపుకోక వేరేమి చేస్తుందీ? కనక అందరికీ సుగతే (1012). అంతా అదే కనక "నేను నేనుగా వుంటూ, నీవు అయినప్పుడు అనుభవించేవాడు ఇంకొక డనిపిస్తుంది." అలాగ అనుకుంటేనే బ్రతుకు బాధ అవుతుంది; లేకుంటే "పుట్టడము బ్రహ్మానందం కాదూ?"

అమ్మ సూక్తులు ఏది పట్టినా "అంతా అదే"కే వెళ్ళి చేరడము. జీవితాన్నతంటినీ "అంతా అదే" అన్న తత్త్వం లోకి సమన్వయించినవారు అమ్మవంటివారు ఇదివరకు లేరు. వేరే సాధనల మధ్యవర్తిత్వము లేకుండా వాక్య మననమే 'అంతా అదే'కి తీసుకు వెళుతుంది. ఈ అడ్డదారి అమ్మ సూచనే. వేరెవరూ ఇంతబలంగా దీనిమట్టుకే సూచించలేదు.

---

మాతృశ్రీ ప్రింటర్సు, బాపట్ల - 522 101.

